

| | | |
|---|---|---|
| పేరు | : | వారణాసి సూర్యకుమారి |
| జననం | : | 24-4-1941 |
| విద్యార్హతలు | : | S.S.L.C. |
| జన్మస్థలం | : | ఏలూరు |
| స్వగ్రామం | : | ద్రాక్షారామం |
| తల్లిదండ్రులు | : | శ్రీ భాగవతి సుబ్బారావు, సత్యవతి |
| భర్త | : | శ్రీ వారణాసి లక్ష్మీజయప్రదన్ (రిటైర్డ్ మేజర్, లెక్చరర్, పాలిటెక్నిక్ కాలేజి, మచిలీపట్నం) |
| సంతానం | : | ఇద్దరు అమ్మాయిలు, ఇద్దరు అబ్బాయిలు (అందరూ డాక్టరేట్లు) |
| మనుమలు | : | ఇద్దరు |
| మనుమరాండ్రు | : | నలుగురు |
| రచనలు | : | గోవింద శతకము, శ్రీరామ కథా సుధ, సూర్యకిరణాలు, మానినీ మానసం ముద్రితం, ఇంకా అనేక కథానికలు, కవితలు, పద్యాలు, నవలలు అముద్రితం |
| సేవా కార్యక్రమాలు | : | వాకర్స్ అసోసియేషన్‌లో ప్రెసిడెంట్‌గా, మహిళా మండలి వైస్ ప్రెసిడెంట్‌గా |
| జీవిత సభ్యులు | : | "సాహితీ మిత్రులు" |
| కృతిస్వీకరణ | : | "కొత్తపూలు" కవితల సంకలనం |
| విదేశాయనం | : | అమెరికా పర్యటన 1996, 2000 సం॥లలో |
| ప్రవృత్తి | : | మృదు సంభాషణ, పరోపకారం, సహనం |

# మానినీ మానసం

వారణాసి సూర్యకుమారి

# మానినీ మానసం

(కథా కుసుమాలు)

**శ్రీమతి వారణాసి సూర్యకుమారి**



ప్రచురణ
**సాహితీ మిత్రులు**
మచిలీపట్నం.

# మనసులో మాట

మూడు దశాబ్దాలుగా ముచ్చటపడి రచనలు చేస్తున్నా నా రచనలు వెలుగు చూసిన వాటి సంఖ్య రాసిన వాటికన్నా చాల తక్కువ. అముద్రిత నవలలు, కథలు అలా శిథిలమైపోతున్న కాగితాలలో చూసుకుంటే చాలా బాధ అనిపించింది. అందుకే ఈ ప్రయత్నం. సమకాలీన సమస్యలకు కొన్ని పరిష్కార మార్గాలు ఉన్నప్పటికీ, కొన్ని అపరిష్కృతంగానే ఉంటాయి. అవి ఏ కాలంలోనైనా ఒక్కలాగే ఉంటున్నాయి. నా అనుభవంలో సమాజంలో చుట్టూ జరుగుతున్న యదార్థ సంఘటనలు అనేకం చూసిన పిమ్మట బాధతో నా మనసు మూలుగుంటే ఆ బాధను బహిర్గతం చెయ్యడమే ముఖ్యోద్దేశంగా రచనల కుపక్రమించడం జరిగింది.

ఒక్కొక్కప్పుడు ఆవేదన అధికమై ఆధ్యాత్మిక ధోరణి కలిగినప్పుడు అంతా 'దైవాధీనం' అనిపించి భగవంతుని స్మరించుకునే ఉద్దేశంలో రచియించినవే 'గోవింద శతకము' 'రామకథాసుధ' (పద్యకావ్యము), 'వేణునాదము' మొదలైనవి. 'వేణునాదము' (ద్విపద కావ్యము) వినిపించ వలసి యున్నది.

సాంప్రదాయ పరంగాను, ఛందోబద్ధంగాను రాసిన పద్యములతోబాటు, భావావేశంతో రాసిన వచన కవితలు కదంబంలా కలిపి ముద్రించిన 'సూర్య కిరణాలు' చీకటిని చీల్చుకు వెళ్ళడంతో నాకు సంతోషం కల్గింది. ప్రోత్సాహం లభించింది. 'సాహితీ మిత్రులు' సంస్థ ద్వారా ఇతర రచయిత్రులతో బాటు నా రచన కూడా 'నవరాగాలు'తో గళం కలిపింది.

ప్రముఖ రచయితలూ, రచయిత్రులూ కలిసి 'క్రొత్తపూలు' వెలయించి ఆ పరిమళాన్ని నాకు 'అంకితం' చేయడంతో ఆనందం పట్టలేకపోయాను.

నాకీ సోపానారోహణకు అవకాశం "సాహితీ మిత్రులు" సంస్థ ద్వారానే సాధ్యమయింది. సంస్థలోని సభ్యులందరకు నా అభివాదములు.

ముఖ్యంగా ఆ సంస్థ వ్యవస్థాపకులు డా॥ రావి రంగారావుగారికి చాలా చాలా కృతజ్ఞతలు. గురుతుల్యులు వారిచ్చిన ప్రోత్సాహమే నాకో 'రచయిత్రి'గా గుర్తింపు తెచ్చిపెట్టింది. వారికి నా శుభాశీస్సులు.

26వ వార్షికోత్సవ సందర్భంలో "మానినీ మానసం" కథా కుసుమాలతో 'భారతీమాత' పాదపద్మాలు పూజించ గల్గుతున్నందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. ఈ కథలలో కొన్నింటిని ఫెయిర్ కాపీ చేసి ఉంచిన, నా భర్త గారైన వారణాసి లక్ష్మీ జయప్రదన్ గార్కి ఈ సందర్భంగా నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. ఈ పుస్తకమును కూడ పాఠక మహాశయులు ఆదరిస్తారని ఆశిస్తూ

- వారణాసి సూర్యకుమారి



# కథల సూచిక

# అంకితం

నా రచనా వ్యాసంగానికి

అత్యంత ప్రోత్సాహ మిచ్చిన

నా భర్త

**మేజర్ వారణాసి లక్ష్మీ జయప్రదన్ గార్కి**

భక్తి శ్రద్ధలతో ...

- సూర్యకుమారి

సావిత్రి ప్రత్యేకమైన వ్యక్తిత్వం కలది. భర్త పిల్లల కోసం ఆరాటపడడం అతివకు అతి సహజం. కాని సావిత్రి ! భర్తతోబాటు భర్త చెల్లెల్ని తమ్ముణ్ణి కల్లాకపటం లేకుండా అభిమానిస్తుంది.

చిన్నతనంలో తల్లిని కోల్పోయిన వాళ్ళని ఆప్యాయంగా అక్కున జేర్చుకుంది తానా ఇంట్లో కాలు పెట్టిననాడే !

ఆనాటి నుంచీ ఈ పదేళ్ళల్లో వాళ్ళ అనుబంధం పెరిగిందే గాని కించిత్తు కూడా తరగలేదు.

ఇంకా సావిత్రికి పిల్లలు కలగక పోవడం కూడా ఒక కారణం కావచ్చు. ఏమైతేనేం ! సావిత్రి భర్త ప్రభాకర్‌కి మామగారు రాఘవయ్య గార్కి కూడా ప్రాణం హాయిగా ఉంది. జీవితం తృప్తిగా సాగిపోతోంది.

బయటకు వెళ్ళే వాళ్ళు వెళ్ళాక మామగార్కి పురాణం చదివి వినిపించడం సావిత్రి ముఖ్యమైన దినచర్య. ఆమె శ్రావ్యంగా చదువుతుంటే మైమరచి వింటూ "మేం చేసుకున్న పుణ్యం తల్లీ ! నీ వంటి బంగారు తల్లి ఈ యింటి పెద్ద కోడలైంది." అంటూ మురిసిపోవడం ఆయన అలవాటు.

పక్షవాతం వచ్చి మంచం మీద నుండి లేవలేని నిస్సహాయ స్థితిలో ఉన్న ఆయన సేవలు చేసేందుకు ప్రత్యేకం ఒక మనిషిని నియమించినా వేళకి మందులివ్వడం, భోజనం పెట్టడం లాంటివి తనే చేస్తుంది సావిత్రి. వార్తా పత్రికలు చదివి వినిపిస్తూ, బయట ప్రపంచం అంతా ఇంట్లోనే ఉండేలా ఎదురుగా టి. వి. అమర్చి ఉంచింది. ఆయన అవసరాలు గమనించి శ్రద్ధగా చూస్తున్న సావిత్రిని కూతురులాగే అభిమానిస్తారు రాఘవయ్య గారు.

చూస్తుండగానే పొద్దు గడిచి పోతుంది. మళ్ళీ సాయంకాలం వాళ్ళకోసం నిరీక్షణ. ఇదే పని సావిత్రికి.

ఆరు గంటలైంది. అందరూ వచ్చేవేళకి టీతో బాటు చిరుతిండి సిద్ధం చేసింది హడావిడిగా సావిత్రి. శాంతకి చాలా యిష్టం. వేడి వేడి పకోడీలు. వెజ్జీపిల్ల త్వరగా వస్తే బాగుండు. అంటూ బయటకి వచ్చింది.

దినకరుడు తన దినచర్య ముగించుకుని పశ్చిమాద్రిని చేరుకున్నాడు. ఆదిత్యుని అరుణ కిరణ కాంతులతో అంబర వీధి అలరారుతోంది. వివిధ వర్ణాలు



మిళితమైన వస్త్రధారణతో మెరిసే ఆధునిక యువతిలా సంధ్యాదేవి శశాంకుని ఆహ్వానించే సన్నాహంలో ఉందా అనిపిస్తోంది.

పంకజాలు మాపటి ప్రియు వియోగానికి బాధపడుతూ రేపటి సంయోగమునకై ముకుళిత హస్తాలతో పద్మబాంధవునికి నమస్కరిస్తున్నట్లున్నాయి.

ఉత్సాహంగా ఉదయాన్నే వెళ్ళిన వాళ్ళు నీరసంగా ఇంటి ముఖం పడుతున్నారు ఒక్కొక్కరూ.

కనుచూపు మేరలో శాంతా, మధూలు కానీ ప్రభాకర్ కానీ కనబడక లోపలికి వచ్చేసింది సావిత్రి.

"సావిత్రీ ! ప్రభాకర్ వస్తూనే త్వరగా రా ! గుర్తుందా ఈ రోజు మన ఇంటికి ఒక ముఖ్య అతిథి వస్తున్నారు" అంటూ వచ్చాడు.

"ఇక్కడే ఉన్నా ! గానీ, మీ చిన్ననాటి ఫ్రెండు రాజా అని చెప్పారు కదూ ! స్వీటు, హాటు కూడా సిద్ధం చేసి ఉంచా ! సరేనా !" అంది సావిత్రి.

"సరే ! సరే ! వాళ్ళబ్బాయి పెళ్ళి చూపులకి వచ్చారీ ఊరు. అక్కడ పనయ్యాక ఈ పూట ఉండి రేపు వెడతారు. వంట ఏర్పాట్లు కూడా చెయ్యాలి. ఓ. కే." అన్నాడు.

జవాబివ్వకుండా సావిత్రి సాలోచనగా బయటికి చూస్తూ కనబడింది.

ఏంటీ ! నీ గారాబు పట్టీల కోసమా ! తెగ చూసేస్తున్నావు ?

"ఔనులే ! కోరకుండానే వరాలిచ్చేసే కొండంత దేవతలాంటి వదిన వాళ్ళకి దొరికింది. యింక వాళ్ళకేం లోటు ? నా సంగతే పట్టించుకునేవాళ్ళు లేరు." అన్నాడు.

"అయ్యో ! నా మతిమండా ! మీరు వచ్చాక కాఫీ కూడా యివ్వలేదు కదూ ! ఉండండి. చిటికలో తెస్తా !

"అంత శ్రమ నీకు అక్కరలేదు. తమరి పరధ్యానం కనిపెట్టి నేనే చేసుకుని వచ్చా. ఇంద ! నీ కప్పు తీసుకో ! అందించాడు.

సావిత్రి కళ్ళు చెమర్చాయి. నేనెంత అదృష్టవంతురాలినండి ! మీలాంటి అర్థం చేసుకునే వాళ్ళుంటే హేపీ కదూ ! అంది ఆనందంగా.

"నీదా ? నాదా ? అదృష్టం ! అమ్మ పోయేసరికి మధు, శాంతా పసివాళ్ళు.

నేనూ నాన్నా ఎంత బెంగ పడ్డామో ! నాకు 18 ఏళ్ళు వచ్చాక కాన్పు వచ్చి కవల పిల్లల్ని కని కళ్ళు మూసింది అమ్మ. ఒక నాలుగేళ్ళు పెంచలేక ముప్పు తిప్పలు పడ్డాము. సావిత్రీ ! అసలు పెళ్ళే వద్దనుకున్నవాణ్ణి తొలి చూపులోనే నన్ను ఆకట్టు కున్నావు. పెళ్ళంటూ చేసుకుంటే నిన్నే చేసుకోవాలనుకున్నాను చేసుకున్నాను.

"తాను వలచింది రంభ ! అని అంటారు. అంతే. నాలో ప్రత్యేకత ఏముందని!"

"కాదులే ! నీలో ఏదో శక్తి ఉంది. లేకపోతే నన్నే కాకుండా ఇంట్లో అందరి మనసులనూ ఎలా వశపరచు కుంటావ్ ! అమ్మని మరిపించేలా నీ చేతులమీదుగా పెంచి పెద్ద చేశావ్ ! ఇంక వాళ్ళ పెళ్ళిళ్ళు కూడా మనమే చెయ్యాలి ! మంచి సంబంధాల గురించి ఆలోచించు. అంతేకాని రావడం ఆలస్యమైందేమిటి ? లాంటి చిన్న విషయాల గురించి వర్రీ గాకు. వాళ్ళేం బుజ్జి పాపాయిలు కాదు !

"ఔనండోయ్ ! పెళ్ళంటే గుర్తు వచ్చింది. మొన్న మా మేనత్త కూతురి పెళ్ళికి వెళ్ళాను కదా మధుని తీసుకుని. అక్కడికి మా బాబాయి గారమ్మాయిలు సుశి, శశి కూడా వచ్చారు. వాళ్ళని పరిచయం చేస్తే చాలా సరదాగా మూవ్ అయ్యాడు వాళ్ళతో. మధుకి నచ్చితే శశినిచ్చి చెయ్యవచ్చు." సావిత్రి ఉత్సాహంగా అనడంతో ప్రభాకర్ కూడా బాగానే ఉంటుందనిపించింది. వెంటనే మీ బాబాయితో చెప్పి వాళ్ళకిష్టమైతే ప్రొసీడ్ ఔదాం ! అన్నాడు.

ఇంతలో అటు ప్రభాకర్ స్నేహితుడు రాజా కుటుంబం, ఇటు మధూ, శాంత ఒక్కసారే వచ్చేశారు. అతిథి మర్యాదల్లో పడిన సావిత్రికి ఆలస్యంగా రావడాన్కి కారణాలు చెబుతూ సంజాయిషీ ఇచ్చుకునే పని తప్పిపోడంతో శాంతా, మధూ హమ్మయ్య అనుకున్నారు. ఇల్లంతా సందడితో నిండి పోయింది !

"ఎప్పుడూ ఇల్లు యిలాగే ఉండడం కన్నా తనకు కావలసిందేముంది అనుకున్నారు రాఘువయ్యాగారు తృప్తిగా ! ప్రక్క గదిలో మంచం మీద నుండి అన్నీ వింటూ.

* * *

నిండు జాబిలి పండు వెన్నెలను పరచిపెట్టు ప్రపంచాన్నంతా ఏకచ్ఛత్రాధిపతి అన్నట్లు వెలిగి పోతున్నాడు. అంతలోనే కారు మబ్బులు కబళించగా కళలుడిగిన కలువ బాంధవుని వన్నె తగ్గింది. అలాగే ఐంది మధు పరిస్థితి.



శశి ! తన ప్రేయసి ! ఇంకొద్ది సేపటిలో తన అర్థాంగి కాబోతోందని తీయని కలలు కన్నాడు. కోరుకున్న కోమలితో గడపబోయే తన సంసార జీవితాన్ని రంగుల కలలు కన్నాడు. కానీ ... ఇప్పుడు వచ్చిన సమస్య తల్చుకుంటే భయమేస్తోంది. అసలు దీనికి పరిష్కారం ఏమిటి ? తీవ్రంగా మథన పడుతున్నాడు మధు.

అంతలోనే వచ్చింది సావిత్రి "మధూ ! ఇంకా ఇలాగే ఉన్నావా ? త్వరగా తెములు బాబూ !

ఆప్యాయంగా అంటున్న సావిత్రి ముఖంలోకి చాలా ఉదాసీనంగా చూశాడు మధు. సావిత్రి గుండె కలుక్కుమంది.

"అన్నయ్య ఏం చెప్పలేదా వదినా !" ఎంతో బాధ ధ్వనించిందతని గొంతులో.

"చాలా ఘోరం ! ఇది వదినా ! ఐనా మీకు తెలీకుండా యింత పొరబాటెలాగు జరిగింది ?

"ఘోరమా ? ఏం జరిగింది మధు ! సావిత్రి మనసు కీడు శంకించింది. ఆందోళనగా అసలు విషయం ఏమిటో వివరంగా చెప్పు మధూ ?

ముందు నేనో మాట అడుగుతాను చెప్పు వదినా. మల్లెకు - మందారానికి తేడా ఉందా ? లేదా ?

ఏమిటీ ప్రశ్న ? ఇప్పుడా ధర్మ సందేహం ఏమిటి ? అసలు సమస్య ఏమిటి ? ఐనా మల్లె స్వచ్ఛమైన తెల్లని సున్నితమైన పువ్వు. మందారం రక్తవర్ణంతో ఉత్తేజం కల్గించేలా ఉంటుంది. రెండూ దేవుని పూజకు పనికి వచ్చే పుష్పాలే కదా ?

"వదినా ! ఆ పువ్వుల రంగుల్లో భేదమే చెప్పారు. ముఖ్యాంశము మరొక్కటుంది. మల్లె తన తెల్లదనంతోపాటు సువాసనలు వెదజల్లి మనస్సును ఆహ్లాద పరిచే పరిమళ పుష్పం. మందారం నిర్గంధ కుసుమం ! మల్లెనారాధించే వారి సంఖ్య మందారాన్ని ఆశించే వారి కన్న ఎక్కువ ఔనా ? కాదా ?

అవును ! ఐతే ! అంది ఏటో ఆలోచిస్తూ !

"అందుకే వదినా ! నేను మల్లెనే కోరుకుంటాను. మందారం నాకు వద్దు. అయోమయంగా చూసి సావిత్రి "ఇంతకీ నువ్వనేదేమిటో నాకు బోధపడలేదు. డొంక తిరుగుడు లేకుండా స్ట్రెయిట్‌గా చెప్పు.

"నాకీ పెళ్ళి వద్దు వదినా ! తను చెప్పదల్చుకున్నది ఐపోయినట్లు మధు అక్కణ్ణించి లేవబోయాడు.

"అయ్యయ్యో ! అదేమిటయ్యా ! ఇంతవఱకు వచ్చి యిప్పుడీ మాటలేమిటి? ఖంగారుగా సావిత్రి అతని చేతులు పట్టుకుంది ఆదుర్దాపడుతూ.

"ఔను మరి ! నేను ఇష్టపడినదీ అమ్మాయిని కాదు !

"మరి ! ఆ రోజు మా బాబాయిగారి పెద్దమ్మాయిని చేసుకుంటావా ? అని అడిగితే సరేనన్నావు. ఒక్కసారి వచ్చి పెళ్ళి చూపులు చూడమన్నాము. వెడదాం రమ్మంటే, ఆ పెళ్ళిలో చూశాను, మాట్లాడాను నాకు ఇష్టమే. ఇప్పుడా ఊరు వెళ్ళేందుకు శలవు లేదు అన్నావు. ఇందులో ఎవరూ కావాలని ఏదీ చెయ్యలేదు. నీకు ఇష్టమేనన్నాక మీ నాన్నగారూ, అన్నగారూ కూడా ఏమీ అభ్యంతరం చెప్పలేదు. అనుకోకుండా శాంతకి మంచి సంబంధం కుదరడంతో ఇద్దరికీ ఒకేసారి చేసేయవచ్చునుకున్నాని. అన్నీ 10 రోజుల్లో ఏర్పాట్లైపోయాయి. వెంటనే అనువైన ముహూర్తం కూడా కుదరడంతో శుభస్య శీఘ్రం అనుకున్నాం ! అంతే జరిగింది !

"కాదు వదినా ! ఎక్కడో ఏదో పొరబాటు జరిగింది. మనం మీ వాళ్ళ ఇంటికి పెళ్ళికి వెళ్ళినప్పుడు మీ బాబాయి గారమ్మాయిలంటూ పరిచయం చేశావు కదా ! వాళ్లిద్దరిలో తెల్లగా, పొడవుగా, చలాకీగా ఉన్న అమ్మాయిని నేను ఇష్టపడ్డాను మనసులో. మా బాబాయి పెద్ద కూతుర్ని చేసుకుంటావా అని నువ్వడగ్గానే సంతోషంగా ఒప్పుకున్నాను. సంతోషంతో ఎగిరి గంతేశాను. ఆ కాలు కాస్తా పప్పులో వేశానని ఇప్పుడే అర్థమైంది. ఇంతకీ ఆ అమ్మాయి రెండో అమ్మాయట కదా !"

"ఓహ్ ! అదా సంగతి ! నీ సమస్య యిప్పటికి అర్థమైంది. అది సుశీ. చంపేశావ్! ఇప్పుడెలా ! సాధారణంగా కొత్తవాళ్ళు చూడగానే ఇద్దరిలో సుశీయే పెద్దదనుకుంటారు. దానికి రంగులో తల్లి పోలిక, తండ్రి పోలిక పొడుగూ వచ్చాయి. శశిది కూడా చాలా కళైన ముఖం. కాకపోతే కాస్త చామనఛాయ. రెండు అంగుళాలు సుశీ కన్నా తక్కువ. అంతే కదా. ఇద్దరూ అందగత్తెలే. ఎవరి అందం వాళ్ళది. పైగా శశికి చెంపకి చేరడేసి కళ్ళు. వాటిలో అమాయకత్వం, అణుకువ కొట్టొచ్చినట్లు కనబడతాయి."

"నువ్వెన్ని చెప్పినా మనస్సంగీకరించడం లేదు వదినా !" నిష్కర్షగా అంటున్న మధుని నిస్తేజంగా చూస్తూండిపోయింది.

మెల్లిగా ప్రభాకరు వచ్చాడు. ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తూ.

"చూడండి ! మీ తమ్ముడు ! ఇవ్వాళ మనందరి పరువూ దక్కేట్టు లేదు.



అర్థంతరంగా పెళ్ళి ఆగిపోతే మీ నాన్నగారు తట్టుకో గలరా ! అటు శాంత ! పెళ్ళివారికి ఏమని సమాధానం చెబుతాము. జీవితంలో ముఖ్య ఘట్టం. ఇంత గందరగోళంలో జరగడం ఏం బాగుంటుంది ?" గుక్క తిప్పుకుండి సావిత్రి వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

"ఏం చెయ్యాలో నాకూ తోచడం లేదు !" ప్రభాకర్ దీనంగా మొహం పెట్టాడు.

"ఒక పని చెయ్యండి వదినా ! సింపుల్ ! ఇప్పుడైనా మించిపోయిందే ముంది! శశిని బదులు సుశిని పెళ్ళికూతుర్ని చెయ్యండి. సంతోషంగా తాళి కట్టేస్తాను." అన్నాడు మధు.

"ఎంత సులభంగా చెప్పాడయ్యా ! పెద్ద మనిషి ! పై మీదిట కండువా మార్చినంత సులువుగా పెళ్ళి కూతుర్ని మార్చాలట ! పైగా అక్కని గాదని చెల్లెల్ని !" కించిత్ వెటకారంగా అంది సావిత్రి.

"మరేం చెయ్యమంటావు వదినా ! ఇష్టంలేని పెళ్ళి చేసుకుని జీవితాంతం బాధపడుతూండమంటావా !" తీవ్రత మధులో.

"మధూ !" గొంతులో గూడు కట్టుకున్న బాధ ఒక్కసారి పైకి తన్నింది.

"ఇందాకట్నించీ చూస్తున్నాను. ఎంతసేపూ నీ ఒక్కవైపే ఆలోచించు కుంటున్నావు. అవతలి వ్యక్తికి కూడా ఒక మనసూ, అందులో కొన్ని అభిప్రాయాలు ఉంటాయని నీకనిపించలేదా !

సుశీకి చిన్నప్పుడే మేనత్త కొడుకు రవితో నిశ్చయించేశారు. రవి స్టేట్స్‌లో చదువు ముగించుకుని వచ్చాక దాని పెళ్ళి చేస్తారు. రవి కన్న శశి ఏడాది పెద్దది. అందువల్ల సుశిని నా కోడలిగా చెయ్యమని బాబాయిని తన ఆఖరి కోరికగా కోరింది అత్త. వాళ్ళూ చిన్నప్పటినించీ అలాగే పెరిగారు. రవికి, సుశికి ఒకరంటే ఒకరికి ప్రాణం!

అప్పుడర్థమైందా ! సమస్య ఇంకా జటిలమైంది. పరిష్కారం మాత్రం నీ చేతుల్లోనే ఉంది. కావలసినంత టైము తీసికుని నిర్ణయించుకో ! తెల్లవారి 8 1/2కి సుముహూర్తం. కానీ ఒక్కమాట గుర్తుంచుకో. మనం ప్రేమించే వాళ్ళతో కన్న మనల్ని ప్రేమించే వాళ్ళతో లైఫ్ సాఫీగా సాగిపోతుంది.

ఎక్కడ సున్నితమైన శశి హృదయం గాయపడ్తుందో అని బాధగా ఉంది. పాపం పిచ్చిది. ఈ రోజు తానూ ఒక ఇంటి దాన్నౌతున్నానని తీయని కలలు కంటూంటుంది. కళ్యాణ తిలకంతో కలకల్లాడుతున్న దానికి నీకీ పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం లేదని రాక్షసంగా ఎలా చెప్పడం ? కనీసపు మానవతా విలువలకు ప్రాధాన్యత నిచ్చినట్లైతే మనలో విశిష్టత గోచరిస్తుంది. ఒక మంచి పని చేసి మానవ జన్మ సార్ధకత చేసుకోవాలని ప్రతి ఒక్కరూ అనుకుంటే సంఘంలో ఆరోగ్యకరమైన వాతావరణం ఏర్పడుతుంది.

తరువాతి పరిణామాల గురించి కాదు. నీకు మనఃస్ఫూర్తిగా ఇష్టమైతేనే జరుగుతుంది. లేకపోతే లేదు. బలవంతంగా మాత్రం వద్దు మధూ !" అంటూ సావిత్రి వెళ్ళిపోయింది.

* * *

ప్రాగ్దిశ వెలుగు సూర్యభగవానుని రాకను తెలుపుతూంది.

సావిత్రి మేడ మీదికి వచ్చి భయం భయంగా గదిలోకి తొంగి చూసింది. మధు అప్పటికే లేచి స్నానం చేసి కడిగిన ముత్యంలా స్వచ్ఛంగా కనబడుతున్నాడు. ముఖంలో ఎంతో ప్రశాంతత. ఏదో తెలియని వింత తేజస్సు. చూసేసరికి ముచ్చటేసింది సావిత్రికి. అంతా పెళ్ళి కళ. అనుకుంటూ దగ్గరికి వచ్చి నుదుట కల్యాణం బొట్టు, బుగ్గన చుక్కా పెట్టింది మురిపెంగా. దాంతో ఎలా అడగాలా అన్న సావిత్రి సందేహం తీరిపోయింది. సమాధానం దొరికింది.

నాకు తెలుసు బాబూ ! మధు మనసు నిండా మధువే ! సంతోషంగా కాళ్ళకి పారాణి పెట్టలని కింద కూర్చున్న సావిత్రి తన చేతుల మీద పడ్డ రెండు కన్నీటి బొట్లకి ఆశ్చర్యంగా తలెత్తి చూసింది.

"ఏమైంది మధూ !" ఆర్ద్రత నిండిన సావిత్రి గొంతు.

"నాలో నిద్రాణమైన మానవత్వాన్ని లేపినది నువ్వేగా వదినమ్మా !" అన్న మధు మాటలకి అప్పుడే వచ్చిన ప్రభాకరు "ఔను ! ఐతే ఏంటిట ?" అన్నాడు తమాషాగా.

దూరంగా ప్రభాతం వినిపిస్తుంటే అందరి మనస్సులు భక్తి భరితమై పునీతమయ్యాయి.



## ఆశ

"పోస్ట్" కేక విన్పించింది డాబా మీద వడియాలు తీస్తున్న గాయత్రికి.

ఎన్నో ఆలోచనలలు ఉక్కిరి బిక్కిరి చేశాయి. ఆశలు ఆవరించి ఆ క్షణమే ఆవిరై పోయాయి నిస్పృహగా విడిచిన నిట్టూర్పులో.

"అంత అదృష్టమా తనకి !" అస్పష్టంగా గొణుక్కుంది.

ఎన్నాళ్ళ నుండి తను ఎదురు చూస్తోందో ! ఓర్పు సన్నగిల్లి పోతోంది. కాని ఆ శుభదినం మాత్రం రావడం లేదు. పదే పదే దాన్ని గురించే ఆలోచించే తనని చూస్తే ఇంట్లో అందరికీ వేళాకోళమే. పోస్ట్ అన్న కేక వినగానే ఆశగా ఆతురతగా చూస్తాయి అనుకోకుండా తన కళ్ళు.

ఈ మధ్య గోపాలం, వాణి మరీ ఆట పట్టిస్తున్నారు. శ్రీవారు సరేసరి. ఐనే తనేం భోగభాగ్యాలు కోరుకుందా ? ధన ధాన్యాలు ఆశించిందా ? భగవత్కృప వల్ల తనకేని లోటూ లోదు. వాత్సల్యంతో చూచుకొనే అత్తమామలు. గోపీ, వాణి 'వదినా' అంటూ కమ్మగా పిలిచే వాళ్ళ సాటి ఎవరూ రారు.

"ఎప్పుడూ నవ వికసిత పద్మంలా ఉండాలి గాయత్రీ ! నీ వదనం" అంటారాయన.

అన్నింటికీ మించి స్త్రీ పొందే మాతృత్వపు ఆనందం కూడా తనకు లభించింది. తన చిన్నారి పాపల చిరునవ్వులే తన ఆశా జ్యోతులు.

ఇన్నీ ఉన్నా ఎందుకో ఆకాంక్ష ? ఎందుకీ తపన ! ఏదో సాధించాలనే ఆవేశం. వెనువెంటనే ఏమీ చెయ్యలేననే నిరాశ. ఇంతేనా జీవితం ! బాధగా కణతలు నొక్కుకుంది గాయత్రి.

ఐనా తనదేం వింత కోరిక కాదే ! చాలా చిన్న కోరిక. అదే ! రచయిత్రి కావాలని. ఏదో ఉబలాటం. సరదా. అందుకాయన ఆమోదించి ప్రోత్సహిస్తారు కనుకనే తను కృషి చెయ్యగల్గుతోంది. కాని ఫలితం శూన్యం ...

ప్రయత్నించగా, ప్రయత్నించగా ఫలితం చిక్కవచ్చునని తన నమ్మకం. తను ఊరుకున్నా చెయ్యి ఊరుకోదు. చెయ్యి ఊరుకొన్నా మెదడు ఊరుకోనివ్వదు. తనలో రేగే భావ సంఘర్షణ తన ప్రమేయం లేకుండానే కలం కక్కేస్తుంది. కానీ ... అవి ఎవరికీ పనికి రావుగాబోలు.

"వదినా ! వదినా !" వాణి పిలుపుతో గాయత్రికి ఆలోచనల్లోంచి డాబా మీదనించి దిగిరాక తప్పలేదు.

గోపి, వాణి ముసి ముసి నవ్వులు చూస్తూంటేనే ఏం జరిగిందో అర్థమైంది గాయత్రికి. పూర్తిగా మెట్లు దిగలేక పైకి వెళ్ళలేక అలాగే నిలబడి పోయింది.

"గోపీ ! వదిన కిచ్చెయ్యరా !"

"ఉండనీ వాణీ ! నాకు రఫ్ నోట్సుకి పనికి వస్తుందిలే !"

"ఓహో ! ఆవిడ ఖరాబు చెయ్యగా మిగిలిన కాగితాలు నువ్వు కానిస్తావేమిటి?"

"ఏం నీకేం కష్టం ! మళ్ళీ కాగితాలు కావాలంటే అన్నయ్య తెచ్చిస్తాడులే వదినెకి. పోన్లేగాని పాపం ! చాలా కష్టపడి రాశావు. ఇంద ! అబ్బ ఏం బరువురా బాబూ !" గోపీ వదినె చేతికందించాడు కాగితాల కట్టని.

"వదినా ! ఐనా నీకింత ఓపికెక్కడిదమ్మా ! ఒక చెంప పాపలు సతాయిస్తూన్నా కూర్చునీ, నించునీ, గోడ కుర్చీలు వేసి రాసింది కదా ! ఇవన్నీ వాళ్ళు గ్రహించకుండా ఈజీగా తిప్పి పంపేస్తారే ! ఏం పత్రికల వాళ్ళు బాబూ !"

కళ్ళనీళ్ళ పర్యంతమై అలాగే చూస్తూ నిలబడి పోయింది గాయత్రి తిరిగి వచ్చిన నవలను దీనంగా చూసుకుంటూ.

స్కూలు నించి పిల్లలూ, ఆఫీసు నించి రవీ ఒక్కసారే వచ్చారింటికి. లేని నవ్వు తెచ్చుకుంటూ క్రిందికి దిగి వచ్చింది గాయత్రి.

గాయత్రి చేతిలో కట్టని చూస్తూనే అర్థమైంది రవికి. వస్తున్న నవ్వును పెదాల మాటున దాచుకోను వ్యర్థ ప్రయత్నం చేశాడు.

"అమ్మా ! ఆడీ, పాడీ, అలసీ వచ్చాను ! తీయాతీయని తాయిలమేదో



కొంచెం పెట్టమ్మా !" అని నేర్పించిందమ్మా ! మా టీచరివాళ్ళ. అన్న చిట్టిపాపను చూస్తూ తన బాధ మర్చిపోయింది గాయత్రి క్షణికంగా.

"ఇదిగో చెల్లాయి. అమ్మ చేతిలో ఎన్ని కాగితాలో చూడు. మనకి తాయిలం కట్టిస్తుందే !" అంది పెద్దపాప.

"పడవలు కూడా చేసిస్తావా అమ్మా !" చిన్నపాప ఆశగా అమాయకంగా అడిగింది.

గాయత్రికి ఉడుకుమోత్తనం వచ్చేసింది. ఇంకా అక్కడ ఉంటే భర్త వేళాకోళా ల్నెదుర్కోవాలని మెల్లిగా ఇంట్లోకి జారుకుంది.

* * *

"కంగ్రాట్యులేషన్స్ గాయత్రి గారూ ! మీరింత బాగా వ్రాయగలరని మాకెప్పుడూ తెలియనియ్యలేదేమండి ఇన్నాళ్ళూ !"

"ఆహా ! ఏమి రచన ! ఏమి శైలి ! ఏమి కథా గమనం ! అంటూ లతా, లీలా వాణీ బిలబిలా ప్రవేశించారు.

"ఏదోలెండి కృషి చేస్తున్నానంతే !" ముసిముసి నవ్వులు నవింది గాయత్రి.

"మా వదిన రచనా సామర్థ్యం పత్రికల వాళ్ళిప్పుడే కదండీ మరి గుర్తిస్త. ఇదివరకు రాసినవీ చాలానే ఉన్నా, ఇప్పటికి రచయిత్రి అని ముద్ర పడింది వదినకి. ఇక ధారావాహికంగా వెలువడుతాయి మా వదినె రచనలు". అంది వాణి.

"నువ్వేనా వాణీ ! ఈ మాదిరిగా అంటున్నది ?" ఆశ్చర్యంగా అడిగింది గాయత్రి.

"ఔను వదినా ! నువ్వు బాగానే రాయగలవు. రాశావు కూడాను. చదువుతూంటే పాత్రలు సజీవంగా కళ్ళెదుట నున్నట్లే తోస్తుంది. బహుశా తిరిగి రాగా రాగా నీలో పట్టుదల పెరిగి శక్తి విజృంభించిందని నా నమ్మకం. నీ చిరకాల కోరిక నేడు తీరిందంటే సంతోషించేదాన్ని మొదట నేనే వదినా !"

"వాణీ !" ఆప్యాయంగా వాణీ చెయ్యి నొక్కింది గాయత్రి నిజమా ! అన్నట్లు వాణి కళ్ళల్లోకి చూస్తూ !

"నిజం వదినా !" అంది వాణి.

"ఏది నిజం ! ఏది అబద్ధం !" అంటూ వచ్చేడు రవి.

అన్నాయ్ ! వదిన కథ పడింది చూశావా ! అంటూ సంతోషంగా పుస్తకం తెచ్చి రవి చేతుల్లో పెట్టింది వాణి.

రచయిత్రి పేరు చూసిన రవి మొహంలోకి వింత కాంతి వచ్చింది. క్రీగంట భార్యని గమనించాడు. గాయత్రి కళ్ళల్లోని వెలుగు రవికి గిలిగింతలు పెట్టింది. సంతోషంతో వెలిగిపోతూ ఎన్నో కథలు చెప్పాయి. మోములో చిరు గర్వపు రేఖలు తొంగి చూశాయి.

పాపా ! మీ అమ్మ కథ పడిందేవ్ ! అంటూ పాపను ముద్దు పెట్టుకున్నాడు రవి. గాయత్రి హాయిగా నవ్వుకుంది.

కథ చదవడానికి ఉపక్రమించిన రవి మొహంలో రంగులు మారాయి. వదినా మరదళ్ళిద్దరూ తెల్లబోయి నిలబడిపోయారు.

"ఏమిటండీ !" అంది గాయత్రి ఆదుర్దా నణచుకోలేక.

"గాయిత్రీ ! ఇది నీ కథేనా !" అన్నాడు రవి అనుమానంగా.

"ఏదీ ! ఇటివ్వండంటూ అందుకుని గబగబా చదివేసి అలాగే కూలబడి పోయింది గాయత్రి.

"ఏంకాదమ్మా ! ఈ కథను తను వ్రాయగా నేను చూడలేదు. తనే పంపించిందేమోనని !"

"లేదండీ ! ఆ రచన నాది కాదు. నా పేరు గల ఆ పుణ్యాత్మురాలెవరో. నేను మాత్రం కాదు. ఊరికే అనవసరంగా ప్రశంశించారంతా ! అంతా అబద్ధం !"

"లే లే ! ఏమిటీ కలవరింతలు పట్టపగలు !" అన్న భర్త మాటలకి ఉలిక్కిపడి లేచింది గాయత్రి.

ఏమిటీ ! కలా ! తన పేరు అచ్చులో చూసుకోడం కలేనా ! ఆశలు అడియాశ లేనా. తీరని కోరికలేనా. దిగులు పడింది గాయత్రి.

* * *

"ఓహ్ ! ఎక్స్‌లెంట్ ! నిర్మలా ! ఎక్సలెంట్ ! యిన్నాళ్ళూ రాసింది ఒక ఎత్తు. ఇప్పుడీ రచన ఒక ఎత్తు. దేనికైనా టైము రావాలి. నాకు చాలా బాగా నచ్చింది అంటే చూస్కో !" అన్నాడు ప్రకాష్ భార్య నిర్మల కథ చదివి. కథలో గాయత్రి నువ్వే కదూ !



"చాల్లెండి ! మీ వేళాకోళం మీరూనూ. అసలు మిమ్మల్ని ఎవరు చదవమన్నారు ? ప్రచురణకి పంపాలని రాయలేదు. ఏదో స్వీయానుభవం. మనసులో బాధ భరించలేక ఉపశమనం కోసం కాగితం మీద పెట్టాను. నా ఆశయాలు, పగటి కలలు రంగరించి రాసుకున్నానంతే !" నిర్మల విసుక్కుంటూ భర్త చేతిలోని కాగితాలు లాక్కోబోయింది. "నోనో ! నేనివ్వను. అలాగో పోస్ట్ చేసి మరీ వస్తాను." అన్నాడు ప్రకాష్.

"ప్రత్యేకంగా కష్టపడి కథల పోటీలకి రాసినప్పుడు వెలుగులోకి రాలేదు. ఏమో ఇప్పుడు పడుతుందేమో ! ఏమో ఆయన చెప్పినట్లు ఇప్పటికి టైము వచ్చిందేమో!

పట్టువదలని విక్రమార్కుడులా ఎప్పటినించో కృషి చేస్తూనే ఉంది తను. వదిన కథలు పెంపుడు పావురాల్లా వెంటనే వెనక్కి వచ్చేస్తున్నాయి అని మరిదీ, ఆడబడుచూ వెక్కిరించినా తనకి ఇంకా పంతం పెరిగిందే గాని ఆసక్తి ఏమాత్రం తగ్గలేదు. ఏమో ! ఈ కథ ఆయన బాగుందన్నారు. ఎప్పుడూలా విమర్శించకుండా! అందుకే తనకెందుకో మళ్ళీ ఆశ చిగురిస్తోంది. అదే ఆశ మనిషికి ఊపిరి పోస్తుంది." అనుకుంది మనస్సులో.

# పరిణామం

నీలాల నింగిలో నిండు చంద్రుడు వెన్నెల వెలుగు విరజిమ్ముతున్నాడు. మిలమిల మెరిసే తారకలు కనులకు విందుగా కనిపిస్తున్నాయి. 'వాక్‌మన్'లోంచి మంచి సంగీతం వీనుల విందుగా వినిపిస్తోంది. విరబూసిన విరజాజి పరిమళం నాసికా పుటలకు సోకుతోంది. ఒక విధమైన తన్మయత్వంలో మునిగి ఉన్నాడు గోపాలరావు.

రిటైరైనప్పటినించి మేడమీద బాల్కనీలో 'ఈజీఛైర్'లో కూర్చుని అలా గడపడం బాగా అలవాటైంది అతనికి. అంతలో తపోభంగం కలిగించినట్లుగా ఫోను మోగింది. 'పుత్రరత్నం' గాబోలు అనుకుంటూ 'హలో!' అన్నాడు.

"డాడీ ! నేనూ రామూని ! అమ్మ, మీరు కులాసాయే గద. ఈ మధ్య ఆఫీసులో పని ఎక్కువై ఫోను చెయ్యడం ఆలస్యం చేశాను. ఇంతకీ ఒక ముఖ్య విషయం చెప్పాలి మీకు. ఇంతకు ముందు ఏపనైనా మీకు చెప్పి చేశాను. ఇప్పుడు ఒక పని చేసేసి చెబుతున్నాను. ఏమీ అనుకోవద్దు. ముందుగా చెబితే మీరు వద్దంటారని భయం వేసింది. అమ్మకి కోపం రాకుండా మీరే సర్ది చెప్పాలి."

"అంతా ఉపోద్ఘాతమేనా ! అసలు విషయం చెప్పవా !" అన్నాడు గోపాలరావు అసహనంగా.

"అదే ! నేనూ 'రీటా' అనే అమ్మాయిని రిజిష్టరు మ్యారేజి చేసుకున్నాను. మతాంతర వివాహం మీకు నచ్చదు. అమ్మకసలు ఇష్టం ఉండదని తెలుసు. కానీ ! నన్నర్థం చేసుకోండి డాడీ ! ప్లీజ్ !" అబ్బాయి అభ్యర్థన పూర్తి కాకుండానే ఫోన్ పెట్టేశాడు.



అంత ఆహ్లాదకరమైన వాతావరణంలో కూడా ముచ్చెమటలు పోశాయి. ఒక్కసారిగా మనసు గడ్డ కట్టుకుపోయినట్లైంది. ఒక్కసారి భార్య మొహం కనులముందు దీనంగా కనిపించింది. పాపం పిచ్చిది. ఒక్కగానొక్క కొడుకు పెళ్ళి మీద గంపెడాశలు పెట్టుకుంది.

తానీరోజు లెక్చరరుగా మంచి పేరు వచ్చేలా సహకరించిన తన చిన్ననాటి స్నేహితురాలి కూతుర్ని తన కోడలుగా ఊహించుకుంటూ మురిసిపోతోంది. తనకీ అభ్యంతరం లేకపోవడంతో వాళ్ళకి వాగ్దానం కూడా చేసేరు ఈ మధ్య. రాము చేసిన పనికి తను ఎలా తట్టుకుంటుందో ! ఇదో పెద్ద షాక్ కమలకి.

ఏమైనా ఈ జనరేషన్ వేరు. రాము చేసిన ఘనకార్యం వింటే తనకే తలమునక లయ్యే ఆశ్చర్యం వేస్తోంది.

తను ఆ రోజుల్లో తండ్రితో మాట్లాడటానికే భయపడేవాడు. ఇంక ఎదిరించే ధైర్యం ఎక్కడ ? ఆయనకిష్టం కాని పని ఆయన పరోక్షంలో కూడా చేసేవాడు కాదు. అదో విధమైన గౌరవంతో మెలగడమేగాని ధిక్కరించే ధైర్యం లేదు. ఆ ధైర్యమే తనకప్పుడు ఉంటే తన భార్యని అన్నాళ్ళు పుట్టింట్లో వదిలేసేవాడా !

పెళ్ళిలో చిన్న తగాదా మొదలై చినికి చినికి గాలివానలా మారి తనోవైపు, అప్పుడే అగ్నిసాక్షిగా పెండ్లాడిన కమల మరోవైపు విసిరేయ బడ్డారు.

తన తండ్రికి మాట పట్టింపు చాలా ఎక్కువ. ఆయన పంతంపట్టి పగబూని నట్లు కమలని కాపురానికి రానీయలేదు. తీసుకురావడాన్కి తను సాహసించలేదు. అలా పెళ్ళయ్యాక సుమారు ఐదు, ఆరు ఏండ్లు ఒకరినొకరు చూడకుండా గడిపారు. అలా అలా అనుకుంటూ మెల్లిగా గతంలోకి జారుకున్నాడు గోపాలరావు.

* * *

నేను ఆడిటింగ్‌కి వెళ్ళవలసిన ఊరి పేరు చూడ్డంతోటే ఒక్కసారి గుండెలో ఏ మూలో కలుక్కుమంది. ఆ ఊరు మా అత్తవారి ఊరు. ఎంత వద్దనుకున్నా గతం మదిలో మెదిలింది. వివాహబంధమంటే మాటలా !

నేను ఇంటర్మీడియట్ చదివే రోజుల్లోనే నాకు పెండ్లైంది. ఏ విషయంలోనూ పెద్దలకి ఎదురు చెప్పే అలవాటు లేని నేను పెళ్ళికి కూడా ఏ అభ్యంతరం చెప్పలేదు. పైగా కడిగిన ముత్యంగా, ఇంటికి దీపంలా కలకలలాడే కమల వదనకమలం చూడగానే

పెళ్ళి మీద ఆశక్తి కల్గిందే గాని విరక్తి లాటిదేం కలగలేదు. కాని చదువు సంధ్యలు బొత్తిగా లేని పల్లెటూరు పిల్లే అని మూల మనసులో పీకక పోలేదు. ఐనా తల్లి తండ్రుల నిర్ణయానికే ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చేశాను.

మర్యాద లోపం లేకుండా పెళ్ళి ఉన్నంతలో ఘనంగానే జరిపించారు మామ గారైన రామారావు గారు. కమల ఆయనకు జ్యేష్ఠ పుత్రిక.

సజావుగా పెండ్లి తంతు పూర్తయి తిరిగి వెళ్ళేటప్పుడే వచ్చింది తగూ అంతా. ప్రయాణానికి అంతా సిద్ధమయ్యాక పెండ్లి కుమార్తె మాతో రావటం లేదని తెలిసింది. నాకు ఆశ్చర్యం వేసింది.

గబగబా వెళ్ళి "నేను విన్నది నిజమా !" అన్నాను నాన్నగారితో.

"ఔనురా గోపీ ! ఇస్తానని ఒప్పుకున్న కట్నం డబ్బు ఐదువేలూ యెగవేశాడు మీ మామగారు. మర్యాదగా చివరి క్షణం వరకూ వేచి చూశాను. కాని తనమాట నిలబెట్టుకోలేక పోయాడాయన.

పైగా వచ్చి క్షమించమంటూ నక్క వినయాలు చూపెడుతున్నాడు. నేనూ చూస్తా అదేమిటో ! నడవండి ! నడవండి ! ఆలశ్యం చేస్తే బండి దొరకదు" అన్నారు.

"పోనీ ... తర్వాత ..." నా మాట పూర్తికాకుండానే గయ్యిమని తాడి ప్రమాణాన లేచారు నాన్న.

"అబ్బో ! అప్పుడే ఆలిమీద అబ్బాయికి అభిమానం అధికంగా ఉందే !" అంది అమ్మ వెటకారంగా.

అసలే నాన్న చండశాసనులు. ఆయనికి అమ్మ మద్దత్తు. ఇంక అటువంటి పరిస్థితులలో నిస్సహాయంగా ఉండిపోక యేం చెయ్యగలను ?

ఆయన్నెదిరించే ధైర్యం అప్పటికి లేదు. ఆ మాటకొస్తే అసలు ఇప్పటికీ లేదు. అందుచేతే ఆ విషయంలో తటస్థభావం వహించక తప్పలేదు.

అలా మూడునాళ్ళ ముచ్చటైంది మా వివాహపు తంతు. అప్పటికీ ఇప్పటికీ ఆయన ఆ డబ్బు తెచ్చి ఇయ్యలేదు. ఈయన తన పట్టు సడలింపలేదు. ముద్దు ముద్దుగా ఏడెనిమిదేండ్లైపోయింది. నాతోటి వాళ్ళంతా గృహస్థులై పిల్లా పాపలతో కళకళ ల్లాడుతూ కాపరాలు చేస్తూంటే నేను మాత్రం నాతి గల బ్రహ్మచారిగా జీవనం సాగిస్తున్నాను.



ఉద్యోగరీత్యా ఇంతదూరం వచ్చెయ్యడంతో అత్తవారింటి విశేషాలేమీ తెలియలేదు మళ్ళీ. అమ్మా, నాన్నా కూడా నాతోనే ఉండడంతో అసలా ప్రక్కకి వెళ్ళే అవసరమే కలుగలేదు.

మధ్యలో ఒకసారి మా మామగారు వచ్చి కాళ్ళా వేళ్ళా పడతే డబ్బు తెస్తేగాని మా గుమ్మం త్రొక్కవద్దని నిష్కర్షగా చెప్పేశారు నాన్న. దాంతో ఆయన అభిమానం దెబ్బతిని "ఛీ ఛీ ! డప్పు మనుష్యు"లంటూ ఈసడించి మాట్లాడటంతో అసలే చెడింది వ్యవహారం.

అంతటితో ఊరుకోక నా దగ్గరికి వచ్చి నీకైనా సంస్కారం ఉండాలి. నీ తండ్రి అలాంటివాడు. ఇలాంటి వాడంటూ ఏదేదో మాట్లాడడంతో, చెప్పొద్దూ నాకూ కోపం వచ్చింది. మంచో, చెడో ! తండ్రిని విమర్శించేంతటి సంస్కారం ఎలాంటిదో నాకు తెలీదని ఖండితంగా చెప్పేశాను. పైగా మీ అమ్మాయికి చదవా సంధ్యా ! ఆ మాటకొస్తే అసలు నాకే ఇష్టం లేదు. బి.కాం. ప్యాసైన వాడిని. ఓనమాలు రాని మీ అమ్మాయితో ఏం సుఖపడగలను ? అన్నట్లు గూడా బాగా జ్ఞాపకం. నిజంగా నా మనసులోని అభిప్రాయమనైతేనేమి, నాన్న మాటని సమర్థించడానికి సాకుగానైతేనేమి చదువురాని మొద్దు అని దూషించాను కూడా.

"దొందూ దొందే !" అని సణుక్కుంటూ నిష్క్రమించాడాయన. అంతే అప్పట్నించీ మళ్ళీ ఏవిధమైన సంబంధమూ లేదింక మా రెండు కుటుంబాల మధ్య.

మళ్ళీ ఇన్నాళ్ళకి ఉద్యోగరీత్యా ఆ ఊరు వెళ్ళవలసి వచ్చింది.

'సార్ !' ప్యూన్ పిలుపుతో నా ఆలోచనలు చాలించక తప్పింది కాదు.

ఊరికి బయలుదేరేముందు "అరేయి వాళ్ళ ఇంటికి వెళ్ళేవు సుమా కొంపతీసి. ఆడపిల్ల కలవాళ్ళకి వాళ్ళకే అంత పట్టుదలైతే మనకేం తక్కువ !" అన్నారు నాన్న.

చెప్పకపోడవేం ! ఒక్కసారి కమలని చూస్తేనో అన్న కోరిక అంతరాంతరాల్లో లేకపోలేదు. ఆవులిస్తే ప్రేగులు లెక్క పెట్టే నాన్న ముందు ఆటలేం సాగవు. మౌనంగా తలాడించి ముందుకు సాగిపోయాను.

* * *

అనుకున్నదానికన్న ఒకరోజు ముందుగానే ముగిసింది ఆడిటింగ్. ఫైల్సు చూపిస్తూ ఈ రెండు రోజులూ నాతోనే ఉన్న హెడ్ గుమాస్తా రామయ్య గార్ని చూడగానే అన్పించింది మామగారు గానీ కాదు గదా అని.

వయసుకు మించిన వృద్ధాప్యం కనబడుతోందాయనలో. ఎంతో కృంగిపోయి నిరుత్సాహంగా కనబడతాడెందుకో. ఒకవేళ ఆయనే ఐతే నన్ను గుర్తుపట్టరా అనుకున్నాను. బహుశః చత్వారం మూలాన్నేమో ! అసలే నలుపు. ఈ మధ్య జబ్బు కూడా పడడంతో మరీ అవతారంలా తయారయ్యాను. ఆనమాలు పట్టకపోయినా ఆశ్చర్యంలేదు అన్పించింది.

అంతలోకే రామయ్యగారు వచ్చి తన యింటికి కాఫీకి ఆహ్వానించారు నన్ను.

అది నాకు మామూలే ఐనా ఒక మూల అనుమానం పీకుతున్నందువల్ల వెంటనే అంగీకరించలేక పోయాను. చటుక్కున నాన్నగారి హెచ్చరిక గుర్తుకొచ్చింది సరిగ్గా ఆ సమయానికి. ఐనా అడిగేస్తే పోలా ... అనుకుని ...

"ఎంతమంది పిల్లలు ? ఏమిటి సమాచారం ? మీ ఇంటి పేరేమిటి ? అంటూ కుశల ప్రశ్నలు వేశాను.

ఎండలోంచి వచ్చిన ఆయన ఉత్తరీయంతో చెమట ఒత్తుకుని కుజాలోని చల్లటి నీళ్ళు ఒంపుకుని గడగడా రెండు గ్లాసుల నీళ్ళు తాగి సావకాశంగా తన సంగతంతా వివరించారాయన. ఎవరేనా అడిగితే చాలన్నట్లుగా.

ఆయన చెప్పిన వివరాలతో నా సంశయం తీరిపోయింది. ఆయన మా మామగారే ! సందేహం లేదు.

"మా పెద్దమ్మాయిని అత్తారింటికి పంపేదాకా నాకు మనస్థిమితం ఉండదండి. వారు కోరిన కట్నం డబ్బు సమకూర్చడానికి ఇన్నాళ్ళైనా పరిస్థితులు అనుకూలించడం లేదు. డబ్బు తేలేదని వియ్యంకుడు, చదువు లేదని అల్లుడూ పెండ్లై ఎనిమిదేళ్ళౌతున్నా దాన్ని తీసుకొని పోలేదు. అది లోలోన కుమిలి పోతూంటే చూడలేక పోతున్నాం. అదే బెంగతో నా భార్య మంచం పట్టింది. పోని తర్వాత పిల్లకి పెళ్ళి చేద్దామని ప్రయత్నిస్తే మీ పెద్దమ్మాయిని భర్త వదిలేశాడట కదా అంటూ ఆ పెళ్ళివారు వెనక్కి వెళ్ళారు. ఇటు ఎదిగిన మగ పిల్లలు కాలేజీ చదువుల కందుకున్నారు. ఎలాగైనా పెద్ద పిల్ల కాపరం కుదుట పరచాలనే ఉద్దేశ్యంతో కష్టపడి నోళ్ళు కట్టుకుని నాలుగు వేలు మాత్రం పోగు చెయ్యగలిగాను. మిగతా వెయ్యీ ఎప్పటికో. సామాన్య గృహస్థుని, గుమాస్తాని. రోగిష్టి భార్యతో, కాలేజీ చదువులు చదివిస్తూ కుటుంబం గడవడమే కష్టంగా ఉంటూంటే డబ్బు వెనకేయడం సాధ్యమా



బాబూ ! కొంచెం ఆగి కన్నీళ్ళు తుడుచుకున్నారాయన.

ఆయన చెబుతున్నదంతా వింటూంటే ఎంతేనా జాలేసింది. మా పట్టుదలలకి అర్థం లేదనిపించింది. పెళ్ళి నాటి కమల ముఖం నా కనులలో కదిలింది. ఏమైనా కాఫీకి వారింటికి వెళ్ళాలనే తీర్మానించుకున్నాను.

* * *

ఇంటి దగ్గర వాతావరణం గమనించే సరికి పరిస్థితి అంతా అర్థమైంది. ఆయన చెప్పినదాంట్లో అతిశయోక్తి యేమీ లేదనిపించింది. నా మూర్ఖత్వానికి నాపై నాకే అసహ్యం వేసింది.

నా మరదలు విమల "కులాసానా బావగారూ !" అని పల్కరించడంతో ఉలిక్కిపడ్డాను.

"బాబూ గుర్తున్నామా !" అని హీనస్వరంతో ప్రశ్నిస్తున్న అత్తగారి ముఖంలోకి చూడలేక అపరాధిలా తల వంచుకున్నాను. "చిన్నవాడవైనా క్షమించు బాబూ ! నిన్ను మొదటి రోజునే గుర్తించినా గుర్తించనట్లే ప్రవర్తించాను. పెద్దల తొందరపాటు వల్ల పిల్లల భవిష్యత్తు నాశనమవడం ఘోరమైన విషయం. ఈ సత్యం నేను త్వరలోనే తెలుసుకున్నా నా ఆర్థిక దుస్థితి వల్ల యేమీ చెయ్యలేక పోయాను. అన్న మాట నిలబెట్టుకోవాలనే ఆత్మాభిమానంతో ఇన్నాళ్ళూ తాపత్రయపడ్డాను. యిప్పుటికేనా మీ పట్టుదలలు విడిచిపెడితే మీ జీవితం బాగుపడడమే కాక తక్కిన వాళ్ళ భవిష్యత్తుకి కూడా బాట యేర్పడుతుంది !! ఏమంటావు బాబూ.

ఏమంటాను. అప్పటికే సిగ్గుతో సగం ఛస్తే.

ఆయన నన్ను గుర్తించినట్లుగానే నేను మాత్రం ఆయన్ని గుర్తించలేదు. ఐనా యేం చేశాను య ఐందేదో ఐంది. ఇక ఏమైనా నాన్నకి నచ్చచెప్పాలి. ఇన్నేళ్ళు వచ్చినా వ్యక్తిత్వం అంటూ లేకపోయాక ఎందుకీ వెధవ బ్రతుకు. నాలో ఈ అభిప్రాయం ఏర్పడగానే కమలని చూడాలనే ఆరాటం ఎక్కువైంది. కమల కోసం ఆతురతగా నా కళ్ళు వెదుకసాగాయి.

గాజుల చప్పుడు కాగానే ఆశగా చూశాను. కాఫీ, టిఫిన్ పట్టుకొచ్చింది విమల!

"మీ అక్క యేదీ ?" అన్నట్లు ప్రశ్నార్థకంగా ఉన్న నా మొహం చూసి ఫక్కున నవ్వింది విమల. బిత్తర పోయాను.

"అక్క లేదండీ ! కాశీ వెళ్ళింది." అంది ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

"కాశీయా !" తెల్లబోయాను.

"ఔను. చెప్పటం మరిచేపోయాను. మా కమల భలే పట్టుదల కల మనిషనుకో. చదువు లేదని నువ్వానాడు తృణీకరించినట్లు తెలుసుకున్నది మొదలు ఎ. బి. సి. డి. లు దిద్దడం ప్రారంభించి ఏక దీక్షతో, స్వయంకృషితో మెట్రిక్ కట్టి ప్యాసై ఆ తర్వాత అన్ని పరీక్షలూ వరుసగా ఫస్టు క్లాసులో ప్యాసై ఇప్పుడు ఎమ్. ఏ. పరీక్ష వ్రాయడానికి వెళ్ళింది. కాశీలో వాళ్ళ మేనమామ ఉద్యోగం చేస్తున్నాడు. అందుకని పదిరోజులు ముందే వెళ్ళింది."

"కమల ... ఎమ్. ఏ. ... అప్రయత్నంగా నా నోటి నుంచి వెలువడ్డాయి. నా ఆశ్చర్యానికి అంతే లేకపోయింది. నేను బి. కాం. మాత్రమే మరి !

"అంత ఆశ్చర్యం ఎందుకు బావగారూ ? తల్చుకుంటే ఏపని మాత్రం సాధించలేం ?" అంటున్న విమల మాటలతో గాబరా పుట్టింది.

"ఇంక వెడతా"నంటూ లేచా. అక్కడ ఉంటే నన్ను ఊపిరాడనివ్వదేమో మరదలు పిల్లని భయం వేసిన మాట నిజం.

"వెంటనే కమలని తీసుకు వచ్చేయండి !" అని చెప్పి నా అడ్రసు వ్రాసి ఇచ్చాను.

"నాదొక్క సందేహం ! నీకు కావలసిన చదువుంది కనుక నీకభ్యంతరం లేక పోవచ్చు. రేపు నేను తేగల్గేది నాలుగు వేలు మాత్రమే కదా ! మిగతా వెయ్యి కోసం మీ నాన్నగారేం పట్టుబట్టరంటావా !".

ఆందోళనగా ఆయన అడిగిన తీరు చూసి నా హృదయం ద్రవించి పోయింది. అసలు డబ్బు ప్రసక్తి లేకపోయినా సరే నాకు అందమైన కమలే ముఖ్యం అనే స్థితిలో ఉన్నట్లు ఆయనకెలా చెప్పడం ?

ఒక్క ఆడపిల్ల ఉండి ఉంటే నాన్న ఇంత కఠినంగా ప్రవర్తించ గలిగి ఉండే వారు కాదేమో నన్పించింది.

"ఏం పరవాలేదు. అన్నీ నేను చూసుకుంటాను. మీరు సాధ్యమైనంత త్వరలో రండి. వస్తాను. సెలవు." అని బయలు దేరేను.

ఏదో తెలీని తృప్తితో ఆయన కళ్ళు మెరవడం గమనించి హాయిగా ఊపిరి పీల్చుకున్నాను.

* * *



మెల్లిగా ఆలోచనలలోంచి తేరుకుని భార్యకి చెప్పాల్సిన బాధ్యత గుర్తు వచ్చి ఎలా మొదలు పెట్టాలా అనుకుంటూ !

"కమలా !" పిల్చాడు గట్టిగా. కాస్త ఆందోళన ధ్వనించింది గొంతులో.

"ఆ ! ఆ ! ఇక్కడే ఉన్నాను. పది నిముషాలైంది నేను పైకి వచ్చి. మీరు కళ్ళు మూసుకుని ఏదో ధ్యానముద్రలో ఉన్నట్లు కనబడితే, జ్ఞాన నిద్రో, మరేదో, అంతా చేస్తున్నట్లు మేథో మథనం గానీ చేస్తున్నారోమోనని డిస్టర్బ్ చెయ్యలేదు."

"అరెరె ! నువ్వెప్పుడొచ్చావు !" కంగారు పడుతున్నాడు.

"మీరేం గాభరా పడకండి ! బి. పి. తెచ్చేసుకోకండి ! ఫోన్ రింగ్ అవగానే క్రింద నేనూ తీశాను. రామూ గొంతు వినిపించే సరికి అలా వింటూ ఉండిపోయాను."

"తను చెప్పలేక సతమతమౌతూ ! ఎలా చెప్పాలో రిహార్సలు వేసుకుంటున్న అతనికి చెప్పాద్దూ ! గొప్ప రిలీఫ్ కల్గింది. కానీ ! చిన్న అనుమానం వచ్చింది. ఇంత కూల్‌గా మాట్లాడుతోంది కమల. తుఫాను వచ్చే ముందు ప్రశాంతత కాదు గదా !" అని గోపాలరావు సందిగ్ధంలో ఉండగానే.

"చూడండి ! ఇది వాడి జీవిత సమస్య. వాడి జీవితం వాడు తన ఇష్టం వచ్చినట్లు దిద్దుకునే హక్కు వాడికుంది. పెళ్ళి లాంటి ముఖ్య ఘట్టాలలో మన ప్రమేయం లేకపోవడమే మంచిది. స్వయం నిర్ణయాధికారం వాడు వినియోగించు కున్నాడు. వాడికి నచ్చినట్లు జీవితం దిద్దుకుంటాడు. ఫ్యూచరులో ఏవిధమైన ఒడిదుడుకులు వచ్చినా బాధ్యత వాడిదే కదా ! మనకి పెద్ద బరువు దించాడు. ప్రయోజకుడయ్యాడు మన అబ్బాయి అని సంతోషించి ఊరుకోవాలి మనం. వాడి వ్యక్తిత్వాన్ని మెచ్చుకోవాలి ఒక విధంగా. మనం మారాలండీ. మారుతున్న కాల మాన పరిస్థితులలో మార్పు చాలా అవసరం. ఆ పరిణామం సహజంగా రావాలి."

అనర్గళంగా మాట్లాడేస్తున్న కమలకేసి క్షణం సేపు ఆరాధనగా, ఆప్యాయంగా చూసి

"మొత్తానికి లెక్చరరు ననిపించుకున్నావ్ ! లెక్చరు దంచేశావు, సాంఘిక పరిణామం గురించి."

మనసు తేలిక పడగా హాయిగా నవ్వేశాడు గోపాలరావు. భర్త నవ్వులో శృతి కలిపింది కమల.

# రెక్కలు

బండి కనుమరుగయ్యేవరకూ అట్లాగే చూస్తూ నిలబడి పోయింది జానకమ్మ గారు.

ముసి ముసి నవ్వులతో చిరుసిగ్గు దొంతరలలో నూతనోత్సాహంతో వెలిగి పోతున్న అపరంజి బొమ్మ లాంటి సరళ ముఖమే కదలాడుతోందామె కనులలో.

సరళ ! తన ముద్దుబిడ్డ ! కించెత్తు చింతైనా లేదేం దీనికి ! ఏమిటో ఈ కాలం పిల్లలు. తన రోజుల తీరే వేరు. పెండ్లై పదేండ్లైనా పుట్టినింటి నుంచి వచ్చేస్తూంటే తనకీ బెంగే. తన తల్లికి సరేసరి చెప్పలేనంత దిగులు. విడవలేక విడవలేక విడిపోయేవారు.

మరి ఇప్పుడో ! అలాంటి బాధ తాలూకు ఛాయలసలు కానరావు. ఇంకా తనే ఏదో చెప్పలేని వ్యథ చెందుతోంది.

నీలమేఘావృతమైన ఆకాశం ఇప్పుడా అప్పుడా అన్నట్లు వర్షించడానికి సిద్ధంగా ఉంది. జానకమ్మ గారి మానసిక స్థితిలాగే.

వానొస్తుందో ? వరదొస్తుందో ? ప్రయాణం రేపటికి వాయిదా వెయ్యండంటే అల్లుడు ససేమిరా వల్ల కాదన్నాడు. కూతురేమో వంత పాడింది. అసలు ఆ మాటకొస్తే తొందరంతా దీనికే ఉన్నట్లుగా ఉంది. అసలు దానికి సాయంగా.

తన భర్త కూడా అల్లుడు గారికి అలక వస్తుందేమోనని సరేనన్నారు. ఇక తనేం చెయ్యగలదు ? లోలోపలే బాధను మింగుకుంటూ ప్రయాణ సన్నాహాలు చేసింది. అందులో తొలిసారి కాపరానికి తీసుకుని వెళ్లడమాయె. చీరె అనీ, సారె అనీ పెట్టాలి కదా ! అబ్బాయా, అందనంత దూరాన ఉద్యోగం వెళ్గిస్తూంటె, తన



భర్త చూస్తే అవధ్యులైపోయిరి. ఆయన రిటైరై పోయాక, అందునా పక్షవాతంతో మంచాన పడితే గానీ సరళకి కళ్యాన ఘడియ రాలేదు. ముద్దు ముచ్చట్లు ఘనంగా తీర్చగల్గడం యిప్పుడెలా సాధ్యం ! ఐనా ఏదో ఉన్నంతలో లోటు లేకుండా చేసింది.

తనకు తానే తృప్తి పడుతూ మనసునెట్లాగో సమాధాన పరచుకుని లోపలికి వచ్చిన జానకమ్మగారికి అంతా ఏదో వెల్తిగా తీరని లోటుగా తోచింది. గుండె బరువుగా అయిపోయింది. "వెళ్ళిపోయారా !" అంటూ ప్రశ్నించిన భర్తని చూసేసరికి అంతవరకు అణచి పెట్టుకున్న దుఃఖం మరి ఆగలోదు. వెళ్ళిపోయారన్నట్లు తలాడించింది మాట్లాడకుండా !

గుడ్లనోరు గ్రుక్కుకుంటూ మూగబాధ ననుభవిస్తున్న ఆ మాతృమూర్తిని చూసిన మాధవరావు గారి కనులు చెమర్చి తన పితృ హృదయ తాపాన్ని వెల్లడించుకున్నాయి.

భయంకరమైన నిశ్శబ్దాన్ని, బరువైన వాతావరణాన్ని తేలిక పరిచేందుకు మాధవరావు గారు "అతి సహజమైన విషయానికి కూడా నువ్వింత దిగులు పడతావేం పిచ్చిదానా !" అన్నారు చిన్నగా నవ్వు తెచ్చుకుంటూ. "అదెప్పుడూ వదిలి ఉండలేదు కదా ! పాతికేళ్ళు వచ్చినా పాపాయిలా ఇంట్లో సందడిగా ఉండేది కదా ! చూడండి! ఇల్లెంత చిన్నబోయిందో ! ఐనా మీ మగవాళ్ళకేం తెలుస్తుంది లెండి ఈ బాధ" నిష్ఠూర మాడింది జానకమ్మగారు.

"ఐతే సరిగ్గా వారం రోజులనాడు కొడుకూ, కోడలూ వెడుతూంటే ఎందుకు లేదో ఇంత బాధ ? ఐనా ఆడవాళ్ళ ఆంతర్యం మాకెలా తెలుస్తుందిలే" భర్త మాటలకు జానకమ్మగారు నవ్వకుండా ఉండలేకపోయింది.

"అబ్బాయి సంగతి వేరండి. వాడు పదహారో ఏటే పై చదువులకంటూ పై ఊరికెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఉద్యోగం. ఏదో చుట్టం చూపుగా శలవలకి రావడమే గానీ, మన్నంటి పెట్టుకుని ఉన్నదేదీ ? అందుకే వాడు పెళ్ళై కోడలితో వెళ్ళిపోతున్నా అంత బాధనిపించలేదు.

మరి సరళ విషయం అలా కాదయ్యె, మగా, ఆడా, తనే అయి మనకి చేయూతగా ఉందిన్నాళ్ళూ. మీరీ జబ్బుతో మంచానపడ్డాక మరీని. అన్నింటికీ ఆసరా అయిపోయింది. ఇప్పుడు మనకి దిక్కెవరు ?

"ఓహో ! అందుకా నీ దిగులు ! అది సరే ! అసలీ కారణం చేతనేనా మనం దాని పెళ్ళి ఆలశ్యం చేసింది ?

"అంటే మీరనేదేమిటో స్పష్టంగా చెప్పండి !"

"అబ్బాయికి పెళ్ళి చేస్తే ఆర్థిక సహాయం లోపిస్తుందని అమ్మాయికి పెళ్ళి చేసి పంపించేస్తే మనకి మనిషి సహాయం ఉండదనీ మనం వాళ్ళ పెళ్ళిళ్ళు ఇంత వయస్సులు వచ్చేవరకూ జాగు చేశామంటావా !" అని నా ప్రశ్న.

"ఎంత నీచపుటాలోచన ! అలా ఏ తల్లిదండ్రులైనా తలబోస్తారా ! బిడ్డల భవిష్యత్తు నాశనం చెయ్యాలనుకునే వాళ్ళు అసలు తల్లిదండ్రులౌతారాఅని !" క్రోధావేశాలతో జానకమ్మగారి పెదిమలు వణుకుతున్నాయి. శరీరం కంపిస్తోంది.

"ఊరుకో జానకీ ! కొంచెం శాంతించు ! ఇది నా ఆలోచన కాదు. ఒకరి అభిప్రాయం మాత్రమే."

"వాళ్ళెవరో చెప్పండి, ముఖం మీద నాలుగూ ఝాడించేస్తాను."

"అయినా ఇప్పటి మన సమస్యల తోరణాల మధ్య, మధ్య తరగతి కుటుంబాలలో ఎలాంటి ఊహలుదయించినా ఆశ్చర్య పడవలసిన పనిలేదు. మన సాంఘిక పరిస్థితు లలాంటివి. దానికెవర్నీ ప్రయోజనం లేదు. భార్యా, భర్తా తల్లీ, బిడ్డా ఏ ఒక్కరూ ఒకర్నొకరు అర్థం చేసుకోవడానికన్నా అపార్థాలకే తావిచ్చేట్లుంది మన ఆర్థిక దుస్థితి. సరదాగా కావలసిన పెండ్లిడ్లు కూడా నేటి కాలంలో గడ్డు సమస్యలా తయారయ్యాయి."

"ఇంక ఆపండి మీ ఉపన్యాసం, అపార్థాలకీ, అనర్థాలకీ సామాజిక వ్యవస్థ మాట నాకెందుకు గానీ, నా కుటుంబ పరిస్థితిలో అలాంటి వాటికి తావు లేదు." ధృఢ నమ్మకంతో అన్న భార్య మాటలకు చిన్నగా నవ్వి ఊరుకున్నారు మాధవరావు గారు.

"అయితే ! మనం ఈ రోజునుండీ ఒంటరి వాళ్ళమన్నమాట !" నిస్పృహ ధ్వనించిందావిడ మాటల్లో.

"ఏం నాకు నువ్వు ! నీకు నేనూ ! చక్కగా చిలకా గోరింకల్లా ఉందాం ! ఇప్పుడు మనకేం లోటని !"

జానకమ్మగార్ని ఉల్లాస పరచాలనే ప్రయత్నం ఆయనిది.

"మీరుండండి. చిన్నతనంలో పెద్దల నీడ అవసరం. వృద్ధాప్యంలో పిల్లల అండ అత్యవసరం. అలా కానప్పుడు పిల్లల్ని కనడమెందుకు ? అష్టకష్టాలూ ఓర్చి ఆశలన్నీ వాళ్ళ మీదే పెట్టుకుని పెంచి పెద్దచేస్తే రెక్కలొచ్చాయంటూ ఎగిరిపోతే, పక్షులకీ, మనుష్యులకీ తేడా ఏమిటీ అంట ?" ఆవిడ ధోరణి ఆవిడది.



"అయితే పిల్లల్ని కనడంలో కూడా స్వార్థ చింతనే నన్నమాట. ఒక విధంగా పక్షులే నయం మనకంటే !"

మీతో వాదించలేను గానీ ! పదండి ! ఎట్లాగో అట్లాగ తంటాలుపడి అబ్బాయి దగ్గరికి చేరుదాం. సరళ లేని ఈ ఇంట్లో ఒంటరిగా ఘనం గడపడం అసాధ్యం."

"నాకు మాత్రం స్వంత ఇల్లు విడిచి పెట్టాలని లేదు సుమా ! అయినా అప్పుడే ఏం తొందర. వెడదాములే. కొన్నాళ్ళు కొత్త కాపురం స్థిరపడనీ ! సరళ వెళ్ళిపోతుందని వాడికీ ముందే తెలుసు కదా ! మాట వరసకైనా మన సంగతి ఎత్తలేదేం నీ ముద్దుల కొడుకు !" భర్త ఎత్తిపొడుపు మాటలకు జానకమ్మగారి ముఖం కందగడ్డలా అయింది. కాని వెంటనే తమాయించుకుంది.

"నా బిడ్డలు రత్నాలు. వాళ్ళని తప్పుగా అంచనా వెయ్యడం మనదే పొరబాటు. క్రొత్త కాపురాలకి వెడుతూ ఆ క్షణంలో, ఆ సంబరంలో తాత్కాలికంగా మనమాట మర్చిపోయినా తర్వాత మన గురించి తప్పకుండా యోచిస్తారు. అయినా అమ్మాయి అనుకోలేదని గానీ, అనుకోవాలని గానీ నేను అనుకుంటే అర్థం లేదు. అది పరాయి ఇంటి పిల్ల అయిపోయింది. ఇక దాని ఊపిరి సహితం వారిష్టప్రకారం తీసుకోవలసినదే. అది తన సంసార తాపత్రయంలో మన సాధక బాధకాల ప్రసక్తి తెచ్చుకుని బాధపడడం అనవసరం కూడా ! కాని అబ్బాయి ! గోపాలం మాత్రం తన కర్తవ్యం మరుస్తాడంటే నేనొప్పను. వాడి మీద నాకు చాలా నమ్మకముంది." గంభీరంగా ఆమె అన్న మాటలకు, మాధవరావు గారు తలపరికిస్తూ సాలోచనగా చూస్తుండి పోయారు.

* * *

కాల చక్ర భ్రమణంలో ఆరు మాసాలు ఏ మార్పూ లేకుండా భారంగా దొర్లిపోయాయి.

అన్నగార్ని చూడాలని వచ్చింది మాధవరావు గారి చెల్లెలు మహలక్ష్మి. ఆమె వచ్చిన రెండవ రోజునే అస్వస్థతతో మంచమెక్కింది జానకమ్మగారు ! రోగగ్రస్తులైన భర్త గారి సేవతో, దానికి తోడు మానసిక వ్యధతో చిక్కి సగమైన జానకమ్మ గారికి రుగ్మత ప్రవేశించి పదిరోజులు లేవనీయలేదు.

"ఏమమ్మోయి వదినా చుట్టం చూపుగా వచ్చిన ఆడబిడ్డ చేత కాదు సేవ చేయించుకోవడం. కోడలి చేత సేవ చేయించుకోవాలి గానీ !" అని మేలమాడింది మహలక్ష్మి.

ఆడబిడ్డ మాటలతో కొడుకూ, కోడలూ దగ్గర ఉండి తీరాలనే ఉద్దేశం మరింత బలపడింది. ఆ మాటే భర్తతో అంది జ్వరం తగ్గి పథ్యం తీసుకున్నాక.

"కానీయి, కానీయి, నీ మాట నే కాదంటేగా. మనం అలాంటి నిర్ణయానికి వచ్చేముందు అక్కడి పరిస్థితులు తెలిసికోవడం ముఖ్యం కదా ! అవసరం కూడాను. మహాలక్ష్మి తోడు ఉండనే ఉంది కదా. కాస్త స్వస్థత చిక్కేక ముందు నువ్వు వెళ్ళి చూసిరా ! ఆ తర్వాత మకాం ఎత్తేయవచ్చు."

మహాలక్ష్మి కూడా అన్న మాటనే బలపరచడంతో రెండు రోజులాగి ప్రయాణమైంది జానకమ్మ గారు కొడుకు దగ్గరకి.

* * *

అనుకున్న రోజుకన్నా ముందే వచ్చేసిన జానకమ్మగార్ని చూసి అన్నా చెల్లెళ్ళిద్దరూ ఆశ్చర్యపోయారు.

"అంతా కులాసానా ! గోపాలం ఏమంటాడు వదినా !" అంది మహాలక్ష్మి.

"ఆ ! ఏమంటాడు ! ఇద్దరూ వచ్చేయండి అన్నాడు. కోడలూ అదే మాటంది. కాని రెండు రోజులుండే సరికి నాకే మొఖం మొత్తిందనుకో. అక్కడ ఆ చిన్న ఇంట్లో సదుపాయాలు చాలా తక్కువ. నాకు ఆచారం అదీ సాగదు. అందుకే వెంటనే వచ్చేశాను. జన్మభూమి సాటి ఏదీ రాదనుకో. స్వంత ఇంట్లో ఉన్న స్వేచ్ఛ అక్కడెలా దొరుకుతుంది? అని మరి మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా లోపలికి వెళ్ళిపోయిందావిడ.

తర్వాత "నిజం చెప్పు జానకీ ! మన గోపాలం ఎప్పటిలా డబ్బు పంపడానికి అభ్యంతరం ఉండదు కానీ, ఇక్కడికి మీరు రావడం చాలా ఇబ్బంది అనలేదూ !" అన్నారు మాధవరావు గారు భార్య ముఖంలోకి సూటిగా చూస్తూ.

ఔనన్నట్లు తలూపి "ఆనాడు పెళ్ళిళ్ళు ఆలస్యం కావడానికి మన ఆర్థిక పరిస్థితులూ, మీ అనారోగ్యం కారణాలుగా తీసికోకుండా అసహ్యకరమైన అపార్థాన్నాపాదించిందీ వాడే కదూ !" అంది జానకమ్మగారు భర్తని పరీక్షగా చూస్తూ.

ఈమాటు తలూపడం మాధవరావు గారి వంతైంది.



# కడలి తరంగాలు

సంధ్యా సమయం. సూర్యబింబం అరుణరాగ రంజితమై పశ్చిమాద్రిని అలరిస్తూంది. సాగర, భాస్కరులు చక్కని చిక్కని చెలిమిని ప్రదర్శిస్తున్నారా అన్నట్లు ఆ దృశ్యం అత్యంత మనోహరంగా ఉంది.

ప్రకృతిలోని సుందర దృశ్యాల రసాస్వాదన కూడా కళాపిపాసికే సాధ్యం. ఒక్కొక్కసారి కళా హృదయం కూడా బాధగా మూల్గుతుంది. పరిసరాలను పట్టించుకోలేని మానసిక స్థితిలో మానవుడున్నప్పుడు ఎటువంటి కమనీయ దృశ్యం కూడ కరగించలేదు.

అదిగో సరిగ్గా అలాటి పరిస్థితిలోనే ఉన్నాడిప్పుడు రాజారావు. నెలాఖరు రోజులు. డస్సిన మేనుతో బరువైన మనసుతో, ఖాళీ జేబుతో బీచ్ వడ్డునే నడుస్తున్న రాజారావుని సంధ్యారాగాలు, సాగర కెరటాలు ఆకర్షించలేకపోవడంలో ఆశ్చర్యంలేదు.

సిటీ బస్సుకి డబ్బుల్లేక అడుగులు లెక్కించుకుంటూ ఆఫీసునుంచి ఇంటికి బయల్దేరిన రాజారావుకి దిగులెక్కువౌతోంది. ఉదయం పది గంటలకి పట్టెడు పచ్చడి మెతుకులు ముక్కూ నోటా బొక్కుకుని ఆలస్యమై పోతోందని ఆదరా బాదరా పరుగెడుతూంటే "ఏవండోయ్ ! వచ్చేటప్పుడు పిల్లాడికి పాలడబ్బా తేవడం మర్చిపోకండేం !" అని ఆజ్ఞ పారేసిన శ్రీమతి మాటలు చెవుల్లో ప్రతిధ్వనిస్తూంటే అప్పు ఎలా పుట్టించాలీ ? అన్న ప్రశ్నే ఆకాశమంత పెద్దగా సముద్రమంత లోతుగా కన్పిస్తోంది.

తలవంచుకుని నడక వేగం పెంచినా దూరం అనంతంగా తోచింది. నిస్సత్తువ ఆవరించడంతో ఆగిపోయి ఒక సిమెంటు బెంచీ మీద చతికిలపడ్డాడు. అక్కడక్కడ

పల్చగా జనం బీచ్‌లో కనిపిస్తున్నారు. కొందరు పిల్లలు ఇసుకలో ఆడుకుంటూ గవ్వలూ, అవీ ఏరుకుంటున్నారు. నవ్వులు కేరింతలు. చీకూ చింతా లేని వయస్సది. నిజంగా మానవ జీవితంలో అమూల్యమైన కాలం బాల్యమే. బరువు బాధ్యతలు తెలీకుండా అమాయకంగా ఆటపాటలతో గడిపివేసే ఆ బాల్యం తనకి తిరిగి రమ్మంటే రాదు కదా! అన్నీ మర్చిపోయి వాళ్ళల్లో ఒకడుగా తను హాయిగా గెంతగల్గితే ! ఓహ్ ! ఎంత బాగుంటుంది. తన ఊహలు తనకే నవ్వు తెప్పించాయి. చిరుహాస్యం చిందులేయగా చిన్నగా నవ్వుకున్నాడు. అవిరామంగా అదిరి పడుతున్న అలల్లా తనలో భావతరంగాలు అదుపులేని అంతరంగంలో అంతులేని వ్యధ. మెల్లిగా చుట్టూ చీకటి ఆవరించింది. అతని మ్లానమైన మనసులాగే !

కర్తవ్యం వెన్ను చరచడంతో ఉలిక్కిపడి లేచి మళ్ళీ నడక సాగించాడు. ఆకలికి అల్లాడిపోతున్న పిల్లాడిని సముదాయించలేక సతమతమైపోతోందేమో అలివేలు. తను వస్తాడని, వస్తూ పాలడబ్బా తెస్తాడని కొండంత ఆశతో చూస్తూంటుంది పాపం ! ఏం చేస్తుంది ? ఇప్పటికే రెండు రోజుల్నుంచీ గేదెపాలే పోస్తోంది. అవి పడలేదుట. బాబుకి బేధంగా ఉందని కూడా చెప్పింది. రెండు మూడు చోట్ల ప్రయత్నించాడు. అందరూ మొండిచెయ్యి చూపించారు. "బాబూ ! నీ ముఖం ఎలా చూడనురా !" చెమర్చిన కళ్ళను నులుముకుంటూ బాధను దిగమ్రింగుకున్నాడు.

ఇల్లు వచ్చేసింది. ఇంటిముందుకు వచ్చేసరికి లోపలినుండి వస్తున్న గోపాలం కనిపించాడు. "చిక్కావురా ! చిలకయ్యా !" అనుకున్నాడు మనసులో.

"ఏరా ఈరోజింత ఆలస్యమైంది. నీకోసం చూసి చూసి ఇప్పుడే వెళ్ళిపోతున్నాను !" గోపాలం చేటంత మొహంతో పల్కరించాడు.

"ఏం లేదురా ! సర్దాగా బీచ్ ఒడ్డునే నడుచుకుంటూ వచ్చాను." అంటూ శుష్క మందహాసం చేశాడు రాజారావు.

స్నేహితుడ్ని లోపలికి పిల్చి కాఫీ తాగిపోరా ! అనాలని మనసు పీకుతోంది. కానీ ! పాలున్నాయో లేదో ! అసలే పంచదార ధర మండిపోతోంది. ఉందంటుందో ? అదీ అయిపోయిందంటూ దీర్ఘం తీస్తుందో భార్యామణి అన్న సందేహంలో పడిపోయాడు రాజారావు.

"ఊరకరారు మహాత్ములు ఏమిటీ విశేషం !? అన్నాడు పైకి మాత్రం.



"ఏం లేదుగా ! మా ఫ్యామిలీ అంతా వెళ్ళాలని నాల్గు టిక్కెట్లు రిజర్వు చేయించాను. అనుకోకుండా మేం ఒక పెళ్ళి పార్టీకి వెళ్ళాల్సి వచ్చింది. మీరూ నల్గు రన్నారు కదా ! మీరైనా వెడతారేమోనని తెచ్చాను." అంటూ టిక్కెట్లు తీశాడు గోపాలం.

"హుం ! మాకు అదొక్కటే తక్కువైంది !" స్వగతం మూల్గిన రాజారావు "ఏం సినిమా ! అన్నాడు" లేని ఆసక్తి కనబరుస్తూ.

"ఆకలిరాజ్యం !" చాలా ... బాగుంటుంది ! అన్నాడు గోపాలం వత్తి పలుకుతూ.

వేరే చూడాలా ! రాజారావుకి మనసులో ఏదో చెప్పలేని భావం మెదిలింది.

"సారీరా బ్రదర్ ! అసలే నెలాఖరు ! ఇప్పుడు మేం సినిమా చూసే మూడ్‌లో లేం !" అన్నాడు ఇంకేమనాలో తెలీక !

"అరే ! మరీ చెప్తావ్ ! నేనిప్పుడు డబ్బు అడగడం లేదుగా ! టిక్కెట్లు వేస్టవకుండా మీరు వెళ్ళండి. నీ దగ్గర ఉన్నప్పుడే ఇద్దువుగాని డబ్బు." అంటూ చేతిలో పెట్టేశాడు గోపాలం టిక్కెట్లని.

"అన్నయ్యగారంతగా చెబుతుంటే మీరేమిటండి మరీ బెట్టుసరి చేస్తారు !" అంటూన్న సతీమణి అలివేల్ని భావరహితంగా చూస్తూండి పోయాడు.

"ఔనురా అన్నయా ! మనం సినిమాకి వెళ్ళి ఎన్ని నెలలైంది ! వెడదాం రా!" గోముగా అంటున్న చెల్లెలు సుమతినీ అయోమయంగా చూస్తూండడం తప్ప ఏం చెయ్యలేని రాజారావు మౌనాన్ని అంగీకారంగా తీసుకున్న గోపాలం ట్రైమైపోతుంది. త్వరగా వెళ్ళిరండి ! అంటూ నిష్క్రమించాడు.

గోపాలం వెళ్ళడం చూసి కాఫీ గ్లాసు భర్త చేతికందించింది అలివేలు. "చేతిలో చిల్లిగవ్వ లేదు. టిక్కెట్లుంటేమాత్రం బస్సుల్లోనో, రిక్షాలోనో అఘోరించాలి కదా ! పైగా సెకండు షోకి. ఏమిటి మీ గొడవ ! సినిమా అంటే చాలు ఒళ్ళు తెలీదు." చిర్రుబుర్రులాడాడు రాజారావు కాఫీ చప్పరిస్తూనే.

"పోన్లేరా ఏదో సరదా పడుతున్నారు. తీసికెళ్ళరాదూ ! చంటివాణ్ణి నే చూసుకుంటాగా ! రఘూ కూడా చూళ్ళేదనుకుంటున్నాడు !" అన్న తల్లిని ఏమనాలో తోచలేదు రాజారావుకి. మాటల్లోనే వచ్చాడు రఘు.

"హాయ్ ! లక్కీ ! అస్సలీ సినిమాకి టిక్కెట్లు దొరక్క ఛస్తున్నారు ! అమ్మా త్వరగా అన్నం పెట్టేయ్ !" హడావిడిగా అంటున్న రఘుని శూన్య దృక్కులతో చూస్తున్నాడే తప్ప రాజారావు ఒక్కమాట అనలేక పోయాడు. ఏమిటి వీళ్ళంతా ! సినిమా ! మనుష్యుల మీద ఇంత ప్రభావం చూపిస్తుందా ? తాము పడుతున్నవీ కష్ట సుఖాలే. అయినా ఆ కష్టసుఖాలే ఎవరో పడుతూంటే తెరమీద చూసి బాధ పడిపోయి, సంతోషపడిపోయి డబ్బు ఖర్చు పెట్టుకుని జేబులు ఖాళీ చేసుకుని ఇల్లు చేరడం ! ఇంట్లో కనీసావసరాలు గడవక ఇబ్బందిగా ఉన్నాసరే ! చిన్నా, పెద్దా, ఆడా, మగా అన్న తారతమ్యం లేకుండా సినిమాకి బానిసలై పోతున్నారు. ఇది అంటువ్యాధిలా ప్రబలి పోతోంది. లోపం ఎవరిది? 'నటన' అని తెలుసుండీ ప్రజలెందుకిలా గొర్రెల మందలా మారిపోతున్నారు ? కామా, ఫల్‌స్టాప్ లేకుండా ఆలోచనలు సాగిపోతున్నాయి రాజారావు మెదడులో.

"ఇదిగో ఈ ఐదు రూపాయలుంచండి ! రిక్షాలకి పనికివస్తాయి !" అంటూ భార్య అన్న మాటలతో ఆలోచనా స్రవంతికి అడ్డగోడ పడింది. "ఎక్కడిది ?"

"మధ్యాహ్నం పేపర్లన్నీ అమ్మేస్తే వచ్చింది ! సరేలెండి ! ఆలోచిస్తూ కూర్చోక త్వరగా తెమలండి ఆయన ధర్మమా అని ఇవ్వాళ సినిమా ఛాన్సు దొరికింది. చిటికెలో వంట చేసేస్తాను. భోజనం చేసేద్దాం !"

హుషారుగా చెప్పేస్తున్న భార్య ముఖంలోకి చూస్తూ "పాలడబ్బా మాట అడగదేం చెప్మా !" అనుకుని గుర్తు చేసి లాభం ఏమిటి అని ఊరుకున్నాడు.

అంతలో వాకిట్లో చప్పుడైంది. చూస్తే రిక్షాలోంచి దిగారు పెద్ద చెల్లెలు ఉమా, ఆమె భర్తా, ఇద్దరు పిల్లలూనూ !

"చచ్చాంరా భగవంతుడా ! అని మనసులో గతుక్కుమన్నా ! ముఖాన నవ్వు పులుముకుని "రండి ! రండి వదినగారూ !" అంటూ చేతిలో సంచీ అందుకుంటూ స్వాగత వచనాలు పలక్క తప్పలేదు పాపం అలివేలుకి.

భార్యకేసి జాలిగా చూసి బావగార్ని పల్కరించడాన్కి ముందుకొచ్చాడు రాజారావు.

ఇల్లంతా ఒక్కసారి సందడిగా మారింది. నవ్వులతో నిండింది. కుశల ప్రశ్నలూ కులాసా కబుర్లూ సాగాయి. వీధిగదిలో బావగారితో ముచ్చట్లు సాగిస్తుంటే



అంతా క్షణంలో తయారై వచ్చి నేను రెడీ ! అన్నారు ఉత్సాహంగా ! ఉవ్వెత్తుగా పడిలేచే కడలి తరంగంలా.

వాళ్ళందరినీ నిరాశ పరచడాన్కి మనస్కరించక సరే అని బయలు దేరడాన్కి వీలుగాక ఆలోచిస్తూండిపోయాడు రాజారావు ఒకప్రక్క.

ఇంకోప్రక్క గబగబా కంచాలు పెట్టే ప్రయత్నం చేస్తోన్న అలివేలుని చూస్తూ పిల్లాడి పాలడబ్బా మాటగూడా గుర్తుందో లేదో ! అనిపించి ఇంక లాభం లేదని ఖాళీ జేపు చూపించాడు భార్యకి.

అలివేలు నవ్వుతూ ఓ అదా సందేహం. ఇందాకట్నించీ ఈ హడావిడిలో మర్చిపోయా. మన పక్కింటి వనజ ఎప్పుడో నాలుగు నెలల క్రితం మన దగ్గర తీసుకున్న వంద రూపాయలు ఈ రోజు తెచ్చిచ్చింది. వెంటనే పాలడబ్బా తెప్పించాను. మిగతా డబ్బులివిగో అని తెచ్చిచ్చి ఇంకేం ఆలోచించకుండా తెమలండి ! రేపే జీతాలొస్తాయిగా ఫరవాలేదు. ఎప్పుడైనా కాస్త ఛేంజ్‌గా బయటకి వెడితే కొంపేం మునగదు.

మీ తమ్ముడూ, చెల్లెలూ కూడా పరీక్షలైపోయి సెలవల్లో బోరు కొడ్తోంది అంటున్నారు పాపం ! అంది అలివేలు.

"ఔను పాపం ! గానుగెద్దులాంటి జీవితానికి ఎప్పుడైనా చిన్న చిన్న సరదాలుండడం అవసరం అన్న భావతరంగం లేచింది మనసులో భార్యని చూస్తుంటే. వెంటనే సరే పదండి అన్నాడు రాజారావు.

# పిలక పిల్లాడు

విశాలమైన పెద్ద హాలు. వరుసగా కుర్చీల్లో కూర్చుని ఉన్నారు కొంతమంది యువతీ యవకులు. వాళ్ళ ముఖాల్లో కొట్టొచ్చినట్లు కనబడుతోంది టెన్షన్. ఎ.సి. రూమ్ అయినా చీటికీ మాటికీ చేతిరుమ్మాలుతో ముఖం తుడుచుకుంటున్న వాళ్ళూ, చేతిలోని కాగితాలలోకి తలలు దూర్చేసిన వాళ్ళు కొందరు, దీర్ఘాలోచనగా పై కప్పుని పరిశీలించే వారు కొందరు. ఇదంతా గమనిస్తే ఏదో ఇంటర్వ్యూకి వచ్చి పిలుపుకోసం నిరీక్షిస్తున్నట్లుంది కదూ !

ఇంటర్వ్యూలులో 'అడిగేవాడికి చెప్పేవాడు లోకువ' అన్నట్లుండి 'పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణ సంకటం' అనిపిస్తుంది కూడా !

ఎంతో బాగా ప్రిపేరై వచ్చానా తీరా ఆ సమయానికి 'చదవేస్తే ఉన్న మతీ పోయిందన్నట్లు' తడబాటు. ఇంచుమించు అందరూ ఈ అనుభవాన్ని ఎదుర్కోక తప్పదు. మగవారితో పాటు ఆడవారికి ఈ రోజుల్లో ఈ ఇంటర్వ్యూలు తప్పనిసరి. వారికైతే ఉద్యోగాల కోసమేగాక అదనంగా పెళ్ళిచూపుల ఇంటర్వ్యూలక్కూడా సిద్ధపడక తప్పదు.

తీరా 'రోటిలో దూర్చాక రోకటి పోటుకు వెనకాడితే' ఎలా ? అని యుద్ధానికి సిద్ధమయ్యాక ఫలితాలు దైవాధీనమే కదా !

ఉద్యోగాలకి లంచం ఇవ్వాలి. వరాన్వేషణకి కట్నం ఇవ్వాలి. ఏ ఒకటైనా సరే అని సిద్ధపడే నేటి స్త్రీ అప్పుడప్పుడు 'రెంటికీ చెడ్డ రేవడి' అయి కూర్చోవలసివస్తేనే చిక్కంతా !



ఒక్కొక్కర్నీ పిలవగానే ఉత్సాహంగా లోనికి వెళ్ళి నిరుత్సాహంగా బయటికి వస్తూండడం గమనిస్తూ కూర్చున్నాడు సుధాకర్ నిర్లిప్తంగా.

అతనికిది ఎనిమిదో ఇంటర్వ్యూ. ఇంట్లో ఖాళీగా కూర్చోలేక రావడం. ఎప్పటికప్పుడు ఈసారేనా రాకపోతుందా అన్న ఆశ. మానవుడికి ఊపిరిలాంటిది ఆశ అన్నారెవరో.

ఉద్యోగం రాకపోవడం ఒక ఎత్తు. ఇంట్లో వాళ్ళ దెప్పిపొడుపులు ఒక ఎత్తు. చచ్చిన పాముని ఇంకా చంపుదాం అన్నట్లు చేస్తారు. తనని ఒక అసమర్థుని కింద జమకట్టి తనమీది కోపం అమ్మ మీద చూపిస్తారు నాన్న. "అత్తమీద కోపం దుత్తమీద" చూపించినట్లు. రిటైరయ్యారు. ఆడపిల్లల పెళ్ళిళ్ళు కోసం ఆస్తులు అమ్మవలసి వచ్చింది. అందుకే తనకీ ఆరాటం. నాన్నకి సహాయంగా నిలబడదామని వచ్చాడిప్పుడు.

ఈ ఉద్యోగానికి కావలసిన అర్హతలు కన్న, తనకి ఎక్కువే. ఎక్కువ క్వాలిఫికేషన్‌తో తక్కువ ఉద్యోగానికెందుకురా ! అంటారు నాన్న.

చిన్నప్పుడాయనో పిల్ల జమిందారులా ఉండేవారుట. వారి తాతగారి హయాంలో ఎంతోమందిని పోషించారుట. ఎప్పుడో "తాతలనాడు నేతులు తాగారని ఇప్పుడు మూతులు వాసన చూడా"లన్నట్లుంది. "చింత చచ్చినా పులుపు చావనట్లు"ంటాయి ఆయన మాటలు. "గుడ్డి కన్ను కన్నా మెల్ల కన్ను మేలే" గదా. ఏమీ లేకుండా ఉండడం కన్నా ఏదో ఒక ఆధారం ఉంటుంది కదా అని వాదించి మరీ వచ్చాడు. ఇప్పుడివీ రాకపోతే ... ఊహించడానికే భయంగా ఉంది.

ఇద్దరు అక్కలు పెళ్ళిళ్ళై వెళ్ళినా ఇంకా డిగ్రీ చదువుతున్న చెల్లెలుంది దానికి పెళ్ళి చెయ్యాలి. అమ్మకి దిగులుతో ఆరోగ్యం పాడైందీమధ్య. అన్నింటికీ తనకి ఉద్యోగం రావడమే పరిష్కార మార్గంగా కనబడుతోంది.

ఆ మధ్య ఎవరో వచ్చి అడిగారుట. మంచి చదువుంది. చక్కని రూపం ఉంది. మీరు కోరినంత కట్నం ఇస్తాం. ఉద్యోగం మేము వేయిస్తాం. మా పిల్లని మీ సుధాకర్‌కు చేసుకోండి అని. అప్పట్నుంచీ బామ్మ ఒకటే గోల. "ఒరేయ్ సుధా ! మంచి అవకాశం రా ! చేసుకోరా !" అంటూ చెవిని ఇల్లు కట్టుకుని పోరుతోంది.

"తా దూర కంత లేదు, మెడకాక డోలు" అన్నాట్ట వెనుకటికెవరో ! అలా ఉంది అన్నాడు తను విసుగ్గా.

"వాళ్ళిచ్చే కట్నంతో నీ చెల్లెలి పెళ్ళి కూడా చేసేయ్యొచ్చు కదా. ఉద్యోగం వేయిస్తామంటున్నారు. ఇకనేం. తంతే బూర్ల బుట్టలో పడ్డట్లౌతుంది! ఏమంటావ్" బామ్మ వదిలి పెట్టలేదు. మధ్యలో చెల్లెలు ఒప్పుకోరా అన్నాయ్ ! అన్నట్లు చూసిందేమో అని తనకు అనుమానం. "ఏమే విమలా ! నువ్వైనా చెప్పవే !" అమ్మని తనని సపోర్ట్ చేస్తుందేమోనని పిల్చింది బామ్మ.

"నాకేం తెలుసత్తయ్యా ! మీ అబ్బాయి ఏమంటారో !" అని దాటేసింది అమ్మ.

"మహ తెలివిగా తప్పించుకుంటావు నువ్వు. గోడమీద పిల్లిలా. అంది బామ్మ అక్కసంతా వెళ్ళబోస్తూ.

బామ్మా ! ఈ రోజు ఇంటర్వ్యూకి వెడుతున్నాను. నా మూడ్ పాడు చెయ్యకు అన్నాడు సుధాకర్ బయలుదేరుతూ.

"ఆ వచ్చిందా ! సచ్చిందా ! "సాయెబు సంపాదన బూబమ్మ కుట్టు పోగులకి చాలదు" అన్నట్లు మీ నాన్న సంపాదనలో సగం నీ ఇంటర్వ్యూలకే తగలేస్తున్నావ్. బామ్మ ఇంకా సణుక్కుంటూన్నా వినిపించుకోకుండా వచ్చేశాడు "మండవల్లి సుధాకర్" గట్టిగా పిలవడంతో.

ఆలోచనల నుంచి బయటపడి ఫైల్ తీసుకుని లోనికి నడిచాడు.

అప్పుడే గమనించాడు, చాలా సేపయ్యిందని, చివరగా తానొక్కడే మిగిలినట్లు.

లోపల కుర్చీల్లో నలుగురు కూర్చుని ఉన్నారు. ఇద్దరు యాభై యేళ్ళు పైబడ్డ వారు, ఒక్కరు ఇంచుమించు నాన్న వయసు వాడు, ఒకరు యువకుడు. అందరికీ నమస్కరించి కూర్చున్నాడు. మామూలు ప్రశ్నలయ్యాక ఇంటిపేరు, ఊరు, తండ్రి, తాతగార్ల పేర్లు మరోసారి అడిగారు.

హై క్వాలిఫికేషన్‌తో చిన్న ఉద్యోగం ఎందుకు చేయాలనుకున్నారు అని యువకుడు ప్రశ్నించగానే సుధాకర్‌కి ఆవేశం వచ్చింది.

అవసరమండీ ! అవసరం ఏ పనైనా చేయిస్తుంది ! ఎంతకైనా దిగజారుస్తుంది. ఇంతకంటే నేనే చెప్పలేను. వస్తాను సార్. అని బయటకు వచ్చేశాడు తలవంచుకుని. ఆఫీసు గేటు దాటి వచ్చేస్తూంటే సుధా ! అన్న తండ్రి పిలుపు



వినిపించి అప్పుడు తల పైకి ఎత్తాడు. ఎదురుగా వస్తూ కనిపించాడు తండ్రి నరహరి.

తండ్రి కండ్లలోని ప్రశ్నార్థకానికి జవాబుగా ఒక శుష్కమందహాసం చేశాడు సుధాకర్. కొడుకు ముఖంలోని నిరాశా నిస్పృహలు చూశాక తండ్రి మరేం అడగలేదు. ఇద్దరూ మౌనంగా నడుస్తూంటే ప్రక్కనుంచి వెళ్ళిన కారులోంచి ఎవరో తననే పరీక్షగా చూడడం వారి దృష్టిలో పడింది.

"ఎక్కడో ఎప్పుడో చూసిన ముఖంలా ఉందిరా !" అన్నారు నరహరి గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ.

"ఆయనే ఇంటర్వ్యూలో ఒక మెంబరు నాన్నా ! నా గురించి గుచ్చి గుచ్చి వివరాలన్నీ అడిగారు. ఊరూ, పేరూ, ఇంటిపేరు, నీ పేరూ, తాత గారి పేరూ అన్నీని."

"ఆయన పేరేమిటో"

"శ్రీనివాస్ ! అని ఇంకో ఆయన పిలుస్తూంటే విన్నాను"

"పిలక శ్రీనివాస్ కాదు గదా కొంపదీసి"

ఏం ఆయనైతే మీకు బాగా తెలుసా ?

"తెలీడం ఏమిట్రా బాబూ ! చిన్నప్పటినించీ తెలుసు ! బా...గా తెలుసు." వాడే వీడైతే నీకీ ఉద్యోగం అస్సలు రాదు.

అందేంటి నాన్నా ! "ఎఱుక పిడికెడు ధనం" అంటారు కదా ! తెలుసున్నవారైతే మీరు వెళ్ళి అడిగితే ఇస్తాడేమో అనుకుంటున్నానింకా !

నేనా ! వాణ్ణి అడగడమా ! నెవ్వర్ ! అలాంటి ఆశలేం పెట్టుకోకు. ఆయన మాటల్లో రోషం కన్న ఉక్రోషం ఎక్కువగా ధ్వనించింది.

"లంచాలు పెట్టలేము. రికమెండేషన్ కూడా లేకుండా పనులు జరగడం కష్టం. అదీ మనకు కుదరనప్పుడు నేనే వెళ్ళి అడుగుతాను మరి. మీకు మావాళ్ళు తెలుసట అని చెపుతాను."

"వద్దు ! అలా నువ్వెళ్ళి అడిగితే నామీద ఒట్టే ! ఆ పిలకా శ్రీనివాసే అయితే అంతకంటే అవమానం నాకు మరొకటి ఉండదు."

బాగుంది వరుస. "అమ్మ పెట్టాపెట్టదు. అడుక్కు తినానివ్వదు" అన్నట్లుంది.

"ఏమైనా అను. ఉద్యోగం రాకపోయినా ఫర్వాలేదు. వాడి ప్రాధీనం మాత్రం వద్దు."

ఎందుకు వద్దు ? కారణం చెప్పండి !

చెబుతాను ! మాటల్లోపడి మనం ఎక్కవలసిన బస్‌స్టాప్ దాటి ఎలాగూ ఇంతదూరం వచ్చేశాము. అలా పార్కులో చల్లగా చెట్లు క్రింద కూర్చుందాము పద అంటూ పార్కులోకి దారి తీస్తున్న తండ్రి ననుసరించాడు సుధాకర్.

* * *

మాది జమీందారీ సమిష్టి కుటుంబం. పెద్ద మండువా లోగిల్లో లెక్కలేనన్ని గదులుండేవి. మా తాతాగారు అంటే ఇంట్లో అందరికీ గౌరవం. భయం కూడా.

మా నాన్నగారు వాళ్ళు నలుగురు అన్నదమ్ములు. మా నాన్నగారు అంటే మీ తాతయ్యే పెద్ద. ఆయన వ్యవసాయం చూసేవారు. రెండో ఆయన వ్యాపారం చేసేవారు. మూడు, నాలుగు ఉద్యోగాలు చేసేవారు.

పగలంతా ఇల్లంతా చాలా సందడిగా ఉండేది. పిల్లలందరం ఉదయాన్నే చద్ది అన్నాలు తిని బడికి వెళ్ళేవారం. మధ్యాహ్నం, రాత్రి భోజనాలు కూడా అంతా ఒకే పంక్తిలో సరదాగా తినేవాళ్ళం. పెద్దవాళ్ళు వేరే తినేవాళ్ళు. ఎప్పుడూ పెళ్ళివారిల్లు లాగే ఉండేది.

ఇంట్లో ఇంతమందికీ వంటా, వార్పు చూడడానికి మా పిన్నిలూ, అమ్మా సతమత మవుతుంటే వంటకి దురపు బంధువులలో ఒకామెని పిలిపించారు తాతగారు. ఆవిడ పేరు సుబ్బమ్మ. వంట చాలా బాగా చేసేది. ఆవిడ కొడుకు శ్రీనివాస మాధవ కూడా ఉండేవాడు. వాళ్ళ ఊర్లో ఉండగా పౌరోహిత్యం చెయ్యడం నేర్చుకునేవాడుట. బక్కగా తెల్లగా ఉండి గుండు, గుండుమీద పిలకతో తమాషాగా ఉండేవాడు. మేం 'పిలక పిల్లాడు' అని పిలిచి గేలి చేసేవాళ్ళం. పిల్లలందరం కలిసి ఆడుకుంటూంటే దగ్గరికి ఎప్పుడైనా వస్తే పిలక పట్టుకుని వంట లక్క కొడుకు అంటూ చుట్టూ చేరి ఏడిపిస్తూండే వాళ్ళం. మాధవ అని ఎప్పుడూ పిలిచేవాళ్ళమే కాదు. ఒకరోజు అలా మేం అంతా వాడ్ని ఉడికిస్తుంటే గుడ్లనీరు గ్రక్కుకుంటూ ఓపక్కగా నిలబడి వెక్కుతున్న మాధవని మా తాతగారు చూశారు.

అంతే ! ఒక్కకేక వేశారు. తుపాకి శబ్దానికి చెదిరిపోయిన కాకుల్లా తలోమూలా పారిపోయాం. ఆ మర్నాడే మాధవని స్కూల్లో చేర్పించారు మా తాతగారు.

నాదీ తనదీ ఒకే క్లాసు. ఎందుకో తనతో ఒకే బెంచీ మీద కూర్చోవలసి



వచ్చినా నాకు ఇష్టం ఉండేది కాదు. కావాలని వెనకాలగా వెళ్ళి కూర్చునేవాడిని వాడికి దూరంగా. నాకు మొదటినుంచీ చదువు మీద అట్టే శ్రద్ధ ఉండేదికాదు. మాధవ చాలా శ్రద్ధగా చదివి క్లాసు ఫస్టు తెచ్చుకునేవాడు. టీచర్లందరూ వాడ్ని మెచ్చుకుంటుంటే నాకు చెప్పలేనంత అసూయ కలిగేది. మెల్లగా ఆ సంవత్సరం ఎల్లాగో అయిందనిపించి తర్వాత స్కూలే మారిపోయాను పట్టుబట్టి.

హైస్కూలు చదువు అయిపోగానే నేను కావాలని గుంటూరులో కాలేజీలో చేరాను. మాధవ ఎస్.ఎస్.ఎల్.సి. మెరిట్‌లో పాసైనందువల్ల స్కాలర్‌షిప్ వచ్చింది. తాతగారు వాడిని కాకినాడ పోలిటెక్నిక్ కాలేజీలో చేర్పించారు. అక్కడ వారాలు కుదుర్చుకుని ఎలాగో లా చదువుకుంటూ రాత్రిళ్ళు ట్యూషన్లు చెప్పి పై ఖర్చులకి సంపాదించు కుంటున్నాడని వాళ్ళమ్మ చెబుతూండేది.

సెలవల్లో ఇద్దరం కలిసినపుడు నవ్వుతూనే ఏదో మాట్లాడాలని ప్రయత్నించేవాడు. వాడంటే నాకెప్పుడూ మా దయాదాక్షిణ్యాల మీద బ్రతికే వాడని చిన్నచూపే. అందువల్ల ముఖం తిప్పుకుని వెళ్ళిపోయేవాడిని.

పోలిటెక్నిక్ డిప్లొమో రాగానే వాళ్ళమ్మని తీసుకుని వెళ్ళిపోయాడు. వెడుతూ అందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటూ నా దగ్గరికి వచ్చినప్పుడు, కనీస మర్యాద కూడా పాటించకుండా చివుక్కున అక్కడినుంచి లేచి వెళ్ళిపోయాను.

హైద్రాబాద్‌లో చిన్న ఉద్యోగంలో చేరి నైట్ కాలేజీలో బి. ఇ. చదివాడని, యూనివర్సిటీ ర్యాంక్ వచ్చి ఎమ్. ఎస్. చేయడానికి అమెరికా వెళ్ళాడని వాళ్ళమ్మ చనిపోయిందనీ తెలిసింది చాలా రోజులకి.

ఈలోపున మాఇంట్లోను అనూహ్యమైన మార్పులు జరిగాయి.

మా తాతగారు వృద్ధాప్యంలో మరణించాక మా నాన్నగారు, తమ్ముళ్ళూ విడిపోయారు. ఇల్లు అమ్మేసి డబ్బు పంచేసుకున్నారు. పొలం కూడా వాళ్ళు తమ వాటాకి వచ్చింది అమ్మేసుకున్నారు. వ్యవసాయం తప్ప నాకు వేరే వృత్తి చేతకాదని మానాన్న మాత్రం తనకి వచ్చిన పొలంలో వ్యవసాయం చేసేవారు. దైవాధీనం వరుసగా పంటలు సరిగా పండక పెట్టుబడి కూడా గిట్టక చాలా నష్టం వచ్చేది. అది భరించలేక నాన్న అకాలమరణం పొందారు. ఇంటి బాధ్యత నానెత్తినబడింది.

చదువుకునే రోజుల్లో విలువ తెలుసుకోకుండా అనవసరమైన దర్జాలకి పోయి

పిచ్చిగా ఖర్చు చెయ్యడమేకాని, కానీ సంపాదించడం చేతకాదు. చచ్చీచెడి చదివిని బి.ఎ. డిగ్రీ చదువుతో వెంటనే ఉద్యోగాలేం దొరుకుతాయి. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లైంది నాపని. పొలం కొంత అమ్మేసి వచ్చిన డబ్బుతో జాగ్రత్తగా ఇల్లు గడుపుతూ కాళ్ళు అరిగేట్టు ఉద్యోగం కోసం తిరిగితే చివరికి ఈ గుమాస్తా గిరీ దొరికింది. 'గంతకి తగిన బొంత' అన్నట్లు ఒక్కక్షణం ఆగారు.

"ఇదంతా ఇప్పుడెందుకు చెబుతున్నారు ?" అనుమానంగా అడిగాడు సుధాకర్.

ఎందుకా ! రామాయణం అంతా విని రాముడికి సీత ఏమౌతుంది ? అన్నట్లుంది నీ ప్రశ్న. ఆ పిలక పిల్లాడే ఈ పి. శ్రీనివాస్. అప్పుడంత అవమానంగా చూసినవాడ్ని, అభిమానం చంపుకుని ఎలా అడుగుతాను ? నా కొడుక్కి ఉద్యోగం ఇమ్మని.

"ఔనా ! ఇంత స్టోరీ ఉందా ! ఐతే పదండి ! ఇంక ఆశ వదిలేసుకుందాం! ఉసూరుమంటూ లేచిన సుధాకర్‌ని అనుసరించాడు నరహరి.

* * *

ఒక వారం, పదిరోజులు నిరాశా నిస్పృహలతో నిస్తేజంగా గడిపి ఆరోజు పేపర్లో వాంటెడ్ కాలమ్స్ చూస్తూ మళ్ళీ వేరేదానికి అప్లై చేద్దామని కాగితం కలం తీసుకున్నాడు సుధాకర్.

అంతలో పోస్ట్‌మాన్ రెండు కవర్లు విసిరేసి వెళ్ళిపోయాడు. ఒకటి తన పేరుతోను, ఒకటి తండ్రి పేరుతోను ఉండడంతో తండ్రికి వచ్చిన కవరు బల్లమీద ఉంచి తనకి వచ్చినది తెరచి చూశాడు. అంతే ! పట్టలేని ఆనందంతో అమ్మా ! అని అరచాడు.

ఏమైందిరా ! అంటూ చేతిలో పని ఆపి ఆదుర్దాగా వచ్చింది తల్లి.

నాకు ఉద్యోగం వచ్చిందమ్మా ! మంచి జీతం ! మంచి ఉద్యోగం !

"అలాగా ! సంతోషం నాయనా ! ఇన్నాళ్ళకి ఆ భగవంతుడికి దయ గల్గింది. అన్నింటికీ ఆ శ్రీనివాసుడే ఉన్నాడు" అంది ఆవిడ.

ఔనమ్మా ! అసలు నాకీ ఉద్యోగం రాదనే అనుకున్నాను. నిజంగా ఆ శ్రీనివాసుడే చూశాడు నన్ను.



"ఏమిటీ ! శ్రీనివాసు అంటున్నారు ?" అంటూ లోపలికి వచ్చిన నరహరి గార్కి కొడుకుని, భార్యని, వాళ్ళ ముఖాలలోని ఆనందాన్ని చూసి ఏమిటి విషయం ? నాకూ చెబితే నేనూ సంతోషిస్తాగా అన్నారు.

వెంటనే సుధాకర్ తన ఆర్డరు కాగితం తండ్రి చేతిలో పెట్టాడు.

అది చూసిన నరహరి గారి ముఖంలో ఆనందం కన్నా ఆశ్చర్యం కొట్టవచ్చినట్లు కనబడింది. అంతలోనే

తండ్రికి వచ్చిన ఉత్తరం కూడా చేతిలో పెట్టాడు. అది చదువుతూంటే ఆయనకి కన్నీళ్ళాగలేదు. గబుక్కున తను అందుకుని చూశాడు సుధాకర్.

ఉత్తరం సాంతం చదివి చివర్న కృతజ్ఞతలతో మీ శ్రీనివాసు బ్రాకెట్స్‌లో (పిలక పిల్లాడు) అని ఉండడం చూశాక విషయం అర్థమైంది.

"అపకారికైనా ఉపకారం చేయాలనే ఉదారబుద్ధి ఉన్నందువల్లే ఆ శ్రీనివాసు గారు అంత వృద్ధిలోకి వచ్చారు" అన్నాడు.

ఔను ! అన్నట్లు తల ఆడించారు నరహరి.

# ముదిమి

సంధ్యవేళ. సావిట్లో మూలగా మంచం మీద పండుకొన్న అవ్వగారి మూలుగుకి గోడమీది పాత గడియారపు ధ్వని లయ వేస్తున్నట్లుంది. మేకుని వ్రేలాడుతున్న వెంకటేశ్వర స్వామి క్యాలండరు గాలికి అటూ ఇటూ ఊగుతోంది గమనిస్తున్నానన్నట్లుగా. ఇంట్లో అందరూ ఎవరి పని మీద వాళ్ళు వెళ్తున్న మూలంగా చాలా నిశ్శబ్దంగా ఉంది.

అవ్వగారు మూలుగు నిలిపి "సీతా ! బాలూ ... ! రా...జూ" అంటూ వణుకుతూ పిల్చారు. జవాబు వినరాలా ! ఎవరూ పలకక కాదు. ఆవిడకు వినబడక. దగ్గరకొచ్చి తట్టే వరకు కళ్ళు మూసుకుని పిలుస్తూనే ఉంటుందావిడ. చంటిపిల్ల గుక్కపెట్టినట్లుగా. ఎవరొచ్చిందీ లీలగా మాత్రం కనబడుతుంది. అదో సుగుణం.

జవసత్వాలుడిగి, చేతులు, కాళ్ళూ స్వాధీనం తప్పి శుష్కించిన శరీరంతో, మందగించిన చూపుతో పరాధీనంగా పడి ఉన్నది పాపం అవ్వగారు. తల, చేతులూ ఎప్పుడూ వణుకుతూ, నోటంట నిర్విరామంగా చొంగ కారుతూంటుంది. పండు తమలపాకులాంటి ఆమె దేహవర్ణపు ముడుతలు పూర్వపు అనుభవాల్ని, అంద చందాల్ని చాటిచెప్తున్నట్లుంటాయి. సహస్ర మాసజీవి అనడంలో సందేహం ఉండదు. త్వరలో ఆ నూరేళ్ళు నిండేందుకు ఎదురు చూస్తూన్నదామె.

"సీ...తా..." ! బాలూ ... పాపా... ఊ...మా, బా...చీ ప్రాణం పోతోందర్రా" ...! వణికిపోతూ చిన్న ఆక్రందనలా ... పిల్చింది అవ్వగారు. స్వరం బలహీనంగానే ఉన్నా దండించినట్లుగా ధ్వనిస్తూనే ఉంది.

"అస్తమానూ మీ మంచం దగ్గరే కుర్చుంటే నా పిల్లల పనీ, వంట పనీ ఎలా ఔతుంది" అంటూ సణుక్కునే కోడలి మాటలు వినబడవు. "మేం ఆడుకోవద్దా !



అస్తమానూ నీకదే పని. పిలుస్తూనే ఉంటావ్" అంటూ మనుమలు తన ఎదుట నుంచే పారిపోడం కనబడదు. "నన్ను పిలవకు, నువ్వుంటే నాకసహ్యం. నేనెందుకు చెయ్యాలి? ఆస్థులు అనుభవిస్తున్న కొడుకులూ, కోడళ్ళూ చెయ్యడం విధాయకంగాని మధ్య నాకేం" అంటూ ఇచ్చింది చాలక అసంతృప్తితో విరుచుకుపడే కూతురి వైనం తెలియదు.

ఆఫీసు పనుల్లో మునిగి తేల్తూ క్షణం క్షణం పిల్చే తల్లికి సేవ చేయడాన్కి తీరికా, ఓపికా లేక పైకి విసుక్కోలేక లోపల బాధ దిగమ్రింగుకొనే కొడుకుల అవస్థ ఆవిడకు అంతు చిక్కదు. ఆవిడ పని జరగడం ఆవిడకు ప్రధానం.

నిత్యకృత్యాలు తీర్చుకోవడం దగ్గర్నించి, స్నాన పానాదులు, దుస్తులు మార్చడం అన్నింటికీ పాపం అవ్వగారు ఇతరుల మీద ఆధారపడవలసిందే. పాలు గూడా ఇతరులు త్రాగించవల్సిందే. అటువంటి నిస్సహాయ పరిస్థితి అవ్వది. ఎవరో ఒకరు వచ్చి ఆపని చూసే వరకు పిలుస్తూనే ఉంటుంది. అంతా విసుక్కోవడం ఆవిడకు వినబడక పోవడం ఒక విధంగా ఆవిడ పాలిట వరమే అయినా అది యితరుల పాలిట శాపంగా పరిణ మిస్తూంటుంది ఒక్కొక్కప్పుడు. చేతుల్లో పనులు వదలి వెళ్ళేవరకు పలికినా పిలుస్తూనే ఉండడం విన్నవాళ్ళెవరైనా ఇంట్లో వాళ్ళు ఆమెని పట్టించుకోడం లేదనుకుంటారు. అది సహజం కూడాను. చేతాచెవలకోతా అన్నట్లుంటుందప్పుడు ఇంట్లో వాళ్ళ పరిస్థితి. ప్రత్యేకంగా తల్లిసేవకై ఎవర్నైనా ఏర్పాటు చేసేందుకు కొడుకులకి ఆర్థిక స్థోమత లేకపోలేదు. అవ్వగారి ధాటికి తట్టుకుని చెయ్యగల వాళ్ళొక్కరూ కనబడలేదు. పైసా మీది ఆశైనా వదులుకుని పనిలో చేరిన పదోనాడే పలాయనం చిత్తగిస్తూంటే ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు ? ఇంట్లో వాళ్ళ చేతే సేవ చేయించుకోవాలని అసలు అవ్వగారి ఉద్దేశం ! అని కోడళ్ళ అంతరాంతరాల్లోని ఊహ.

"చీతా ... బాచీ ... రాజూ ... !" అరిగిపోయిన పాత గ్రామ్‌ఫోను రికార్డులా అరుస్తూనే ఉంది అవ్వగారు. పిలుపు కందని దూరంలో ఉన్నారేమో ఎవరూ రాలేదు. అవ్వకు ఆంధోళన అధికమైంది. కడిపెడు బలగం ఉండీ ఎవ్వరూ దగ్గిర లేకుండానే ప్రాణం పోతుందేమోనని ఆమె భయం. అందుకే ఎప్పుడూ ఎవరో ఒకరు దగ్గర ఉండాలను కుంటుంది. అలాగే పది సంవత్సరాలుగా మంచాన బడి తీసు కుంటున్నదామె. 'దిన దిన గండం వెయ్యేళ్ళాయుష్షు' అన్నట్లుంది అవ్వగారి పని.

పిల్చీ పిల్చీ ఎవరూ రాకపోయేసరికి అవ్వగారి ఆత్మ ఘోషించింది. 'ఎంత చేశాను ! ఎంత చేశాను ! వీళ్ళందరికీ. ఎన్నెన్నో అవస్థలు పడి వీళ్ళ నింతవాళ్ళని చేస్తే నేను పడిపోతే నాకు చెయ్యడానికి ఇంత బాధ పడ్తున్నారు. అవ్వ !... అవ్వ ! బాధగా మూల్గిన అవ్వగారి మనసు గతం మీదికి పోయింది.

"తను కాపురానికి వచ్చిన తొలి రోజుల్లో ఎన్ని కష్టాలు పడ్డారని ! వచ్చే కడుగు రాళ్ళతో ఇల్లు గడవడాన్కి ఎంత బాధ పడ్డారో ! ఇటు పుట్టినింటి నుంచి ఏ అండ దండలూ లేకపోయినా, అటు అత్తింటివైపు ముసలి అత్తగారు తప్ప వేరెవ్వరూ లేకపోయినా, కండ పుష్టీ, మనోధైర్యం ఉన్నాయి కనుకనే నిలదొక్కుకోగల్గింది. పనిమనిషైనా లేకుండా కష్టపడ్తూనే పురుళ్ళూ పుణ్యాలూ సక్రమంగా జరుపుకు వచ్చింది. తమ ఇద్దరి మాటా ఒక్కటై, కాలం గూడా కలిసిరావడంతో చిన్నగా తలబెట్టిన వ్యాపారమే పెద్దదై ఏదో నాల్గు రాళ్ళు వెనుక వేసుకోగల్గారు. ఆ రోజుల్లో చుట్టాలంతా తన్నెంత పిసినారనే వాళ్ళో ! ఎవరేమనుకున్నా లెక్కచెయ్యకుండా ఆనాడలా గుప్పిడి బిగించి ఒక్క నయాపైసా దాన ధర్మాలకి గూడా విడవకుండా కూడబెట్టింది కనుకనే హుం ... ఈవేళ యీ కోడళ్ళు వచ్చి కులుకుతున్నారు. ఇప్పడి వాళ్ళలా తనూ తన స్వసుఖాల కోసం ఖర్చు పెట్టుకుంటే వీళ్ళకేం మిగిలేది ? ఇప్పుడు తన గుప్పెళ్ళు ముడుచుకు పోడాన్కి అప్పడి తన బిగింపుకీ లంకె పెడతారీ కుల్లునాగమ్మలు. పాపం నిజంగా ఆయన దేముడే. తను ఏం చేసినా ఇంటి కోసమే, పిల్లల మంచి కోసమే అని ఊరుకొనేవారు. మహారాజులా ఏబాధా లేకుండా, మంచంబడి తీసుకుని ఒకళ్ళ చేత చేయించుకోకుండా హాయిగానే వెళ్ళిపోయారు. ఈ వృద్ధాప్యంలో ఇలా తనే అవస్థలు పడుతోంది. కన్న బిడ్డలు కనిబెట్టక పోతారా అని ఉన్నదంతా వాళ్ళచేతుల్లోనే పెట్టింది. కూతుళ్ళకి పెట్టిందని కొడుకులకి కోపం. కొడుకులకే ఇచ్చేసిందని కూతుళ్ళకి కసి. వాళ్ళను కునేమాటలన్నీ తనకి వినబడకపోయినా ముఖ కవళికలనిబట్టి వాళ్ళ స్వభావాలు కనిబెట్టలేని మూర్ఖురాలా తను. ఏమీ తెలియకుండా ఇన్నేళ్ళు ఎలా గడిచాయి తనకి ? వాళ్ళని కని, పెంచిన తనకి వాళ్ళ తత్వాలు తెలియకేం చేస్తాయి. కానీ, వాళ్ళ మీద ఆధారపడక తనేం చెయ్యకలదు ? తనంత తను ఏ చిన్నపనీ ... కనీసం అటునుంచి ఇటువైపుకి గూడా కదలలేని పరిస్థితి తనది. తనే కాదు తనలాంటి స్థితిలో ఎవరున్నా ఏం చెయ్యగలరు ? తన శరీరంలో బలం ఉన్నంతకాలం వాళ్ళకోసమే పాటు పడింది. తన శరీరంలో రుగ్మత ప్రవేశించాక కూడా కొన్నాళ్ళు తన పనైనా తాను చేసుకోగల్గింది. కాని ఇప్పుడు ?



ఈ మానవ జన్మే ఇంత. చనిపోయాక పశుచర్మమైనా ఉపయోగ పడుతుంది కానీ ఈ మానవ శరీరం ఎందుకూ పనికిరాదు. అయినా జీవం ఉన్నంతవరకు దీనికి పోషణ జరగవలసిందే ! ఏ బాగం శుభ్రపరచక పోయినా దుర్గంధం పుట్టుకొచ్చి ఈ మాత్రం రారు దగ్గరికి. కనుక చెయ్యాలి. ప్రాణం నిలబడడాన్కి తనకు తాను త్రాగలేక పోయినా త్రాగించాలి. ఏం అంత బలవంతానసైనా ప్రాణం నిలబెట్టుకోవాలా అంటే అదే మఱి ప్రాణం మీద తీపి. అదేం విచిత్రమో ఇంతగా శారీరక, మానసిక బాధలకి గురియౌతూ కూడా ప్రాణం మీది తీపి మాత్రం వదులుకోలేక పోతోంది తను. డాక్టరు వ్రాసిచ్చిన అయిదారు రకాల మందులూ, పళ్ళూ, పాలూ ఏవేళకావేళ తప్పకుండా వేసుకోక పోతే ఏమౌతుందో అని తనకి భయం. అవి ఒకరు ఇవ్వాలి. ఇవ్వరు. వాళ్ళకి అశ్రద్ధ అవును మరి తన ప్రాణం మీద తనకున్నంత మమకారం వాళ్ళకెందుకుంటుంది. పైపెచ్చు కోడళ్ళిద్దరూ ముసిముసి నవ్వులు నవ్వుతారు ఎందుకీవిడకింకా జీవితాశ అన్నట్లు.

మనుమలూ, మునిమనుమలతో కలకల్లాడుతూంటే సంసారం చూసి ఆనందించకుండా చచ్చిపోదాం అని ఎవరనుకుంటారేం ! ఏదో ఆయన లేరన్న బాధ తప్ప తనకేం లోటని. తన మాట జవదాటని తనయులు కోడళ్ళచేత కూడా చేయిస్తారు. ఆ ధీమా తనకుంది. తన వైద్యానికి తరగని ఆస్తి తనకుంది. ఎవరికోసం చేస్తారు. చచ్చినట్లు చేస్తారు. చెయ్యాలి. క్షణం విశ్రాంతి లేకుండా వాళ్ళకోసం పాటుబడి అలసిన ఈ శరీరం చెప్పలేని బాధకు గురియౌతుంటే చెయ్యాల్సిన విధాయకం వాళ్ళకుంది. చేయించుకునే హక్కు తనకుంది.

నరాలన్నీ పీక్కుపోతుంటే బాధని మర్చిపోడాన్కి ఎవర్నేనా పిల్చి ఏమైనా అడిగితే చెవిటిదాన్కి గట్టిగా చెప్పడాన్కి వాళ్ళకి విసుగు.

ఏం కూర వండుకున్నారు ? ఆ వస్తువు జాగ్రత్త పెట్టారా ! ఈ వస్తువెక్కడుంది ? ఆ తలుపు వేశారా ! దొడ్లో కొబ్బరి చెట్టుకి ఎన్ని కాయలు దిగాయి ? లాటి ప్రశ్నలు తనువేస్తే నీకెందుకే అమ్మా ఇంకా యీ తాపత్రయం అంటాడు తన పెద్దకొడుకు. తనకి కాకపోతే ఎవరికి కావాలి ! మూలపడిపోయినంత మాత్రాన ఇల్లూ సంసారం తనవి కాకుండా పోతాయా ! తను తను చిన్ననాడు నాటిన చెట్లేగా ఇప్పుడు ఫలాన్నిస్తోంది. ఎనభై ఏళ్ళనుంచీ ఈ ఇంటితోటి, ఇంటిలోని ప్రతి చిన్న వస్తువుతోటీ ఉన్న అనుబంధం ఈనాడీ పిల్లగాళ్ళు వద్దంటే మాత్రం పోతుందా. దుబరా ఖర్చులు తగ్గించుకోనిడి. ఇప్పుడే ఏదన్నా వెనకేసుకోవాలి అని

తను చెప్పే చాదస్తం కింద జమ కట్టేస్తారు. పిల్లల్ని పెంచడంలో గల సాధక బాధకాలు తనకి అనుభవం కనుక 'రమ'కి ఇంత సంతానం కలగకుండా చూసుకోమన్నాదని అల్లుడికి నిండా కోపం. పైగా ముసలివాళ్ళెవరూ ఈ విధమైన సలహా లియ్యరంటాడు. పదిమంది ఉంటే చరమదశలో ఏ ఒక్కరైనా చేస్తారట. అదీ అతని వితండ వాదం. సరే ! ఎవరి కర్మ వాళ్ళది. అతనికి వచ్చే గుమస్తా జీతంతో పిల్లల్ని నలుగుర్ని సాకడాన్కి పడే ఇబ్బందులు తనకి తెలియవా ! కాని చెబితే కోపం. ఏదో భగవంతుని కృపవల్ల తన పుత్రులు ముగ్గురూ మణిపూసలే. తనేతగని జబ్బుతో తీసుకుంటూ తంటాలు పెడ్తోంది వాళ్ళని. అయినా మురిపెంగానే చూసుకుంటారు తనని. తినలేదు, త్రాగలేదు, పడుకోలేదు, కూచోలేదు స్థిమితంగా. తనమూలంగా వాళ్ళకీ మనస్థిమితం ఉండటం లేదు. తల్లిగా ఇన్నాళ్ళూ తన కర్తవ్యం నెఱవేర్చింది. బిడ్డలుగా తమ ఋణం తీర్చుకోవలసిన తరుణం ఇది. వాళ్ళ వాళ్ళ సహనానికీ, మనోప్రవృత్తికీ పరీక్షా సమయం. తనకీ ఇష్టం లేకపోయినా పోరుకు తినక తప్పటం లేదు వాళ్ళకి. అయినా ఎవరూ బయటపడలేదు ఇంతవరకు. చంటీవెంటాతో తంటాలు పడేవాళ్ళతో సమస్థం చేయించుకోవడం తనకి మాత్రం సరదానా ! వాళ్ళకీ భారంగా ఉండి ఇబ్బంది పెడ్తున్నదని తనకి మాత్రం తెలీదూ ! అసలు ముసలి వాళ్ళకి చెయ్యాలంటే అలా విసుక్కుంటారేగానీ ప్రతీవాళ్ళకీ బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యాలు తప్పేవా! అది ఎవరిదాకా వస్తే గానీ వాళ్ళకి తెలియదు. పరువంతో పాపపుణ్యాల ప్రసక్తి అంతగా రాదు మరి.

ఆమాటకొస్తే తనుమాత్రం యేం చేసిందనీ ! తనకి వాళ్ళు చేసేది చాలక తను ఎలా కుమిలిపోతోందో తన అత్తగారు అంతకన్నా కుళ్ళికుళ్ళి దుఃఖించి ఉండి యుంటుందానాడు. మంచంలో తనకన్న దీనావస్థతో మలమూత్రాదులతో మునిగి తేలుతూ చాలా రోజులే పోరాడిందావిడ యముడితో. ఆవిడకి తను ఈపాటి కూడా చెయ్యలా. ఖరీదైన మందులూ, పళ్ళు అవీ తల్లికి తెచ్చి ఇస్తుంటే డబ్బు ఖర్చైపోతుంది ఆయన మీద విసుక్కునేది తను. పాలే ఆహారంగా బ్రతుకుతున్న ఆవిడకి కసిదీరా నీళ్ళు కలిపి మరీ యిచ్చేది పాలు. అందుకే తనకిప్పుడు అనుమానం. తన కోడళ్ళు కూడా తనకల్లాగే ఇస్తున్నారేమోనని. తన అత్తగారైతే డబ్బూ దస్కం ఏం మిగల్చలేదని అసహ్యించుకునేది తను. కానీ ... బాగా మూట ముట్టజెప్పినా తనపై నిర్లక్ష్యమే అందరికీ. వృద్ధులంటే అంత లోకువ ఎందుకో. సానుభూతి



వాక్యాలు చిలుక పలుకుల్లా పలికేవారే గాని ఓర్పుగా చేసేవాళ్ళే కనిపించరు గదా !

పడిపోతున్న పాత ఇల్లు బాగుచేయించరా అంటే కాటికి కాళ్ళు చాచుకుని కూర్చున్న ముసలివాళ్ళకి వైద్యం చేయించినట్లే ఉంటుందన్నాడు మొన్న చిన్నాడు. అంటే వాడి దృష్టిలో ముసలి వాళ్ళకి వైద్యం అంత అనవసరమన్నమాట. వాళ్ళు మనుష్యుల కింద లెక్కరారు కాబోలు. మృతకల్పులంటే బాగుంటుందేమో.

వయసులో ఉన్నప్పుడు యిప్పటికాలం వాళ్ళకన్న వెయ్యిరెట్లు ఆరోగ్యంగా ఉండేది. ఆ పురుళ్ళు పదిరోజులూ తప్ప మంచాన్నాశ్రయించింది లేదు తను. కాని ఇప్పుడీ వింత జబ్బు పట్టి పీడుస్తోంది. కష్టపడి కూడబెట్టిన డబ్బు తన వైద్యాని కోసమా అన్నట్లైందీ పదిసంవత్సరాలనుంచీ ఇంకా ఎన్నాళ్ళో ఈ సేవ. ప్రాణావశిష్టంగా మంచాన్నంటి పెట్టుకుని ఉండి ఆ భగవంతుని పిలుపుకై చూస్తోంది. ఎవ్వాళ్ళనీ బైట పడవెయ్యకుండా ఈ ఘటం వెళ్ళిపోతే బాగుండును.

మొహం మీద ఈగలు వాలి కళ్ళను తినేస్తూంటే తోలుకోను చేతులైనా స్వాధీనంలో లేవు. ఇటువంటి దయనీయమైన స్థితి పగవారికైనా వద్దు. తనకన్న పశువుల కొట్టంలోని ఆవు నయం. తనతోకతోనైనా తోలుకుంటుంది ఈగల్ని. అంతా తన ఖర్మ. పది నిమిషాల్నించీ పిల్చినా ఎవ్వరూ రాలేదు. ఇక తన గతి ఇంతే ! అనుకుంటూ అవ్వగారు మెల్లిగా లేవడాన్కి వ్యర్థప్రయత్నం చేసి ధమ్మని వెనక్కి పడిపోయారు.

శబ్దం విన్న సీత పరుగెత్తుకుని వచ్చి లేవనెత్తడం, అందరూ ఆవెనుకే వచ్చి నిలబడి ఉండడం గమనించిన అవ్వగార్కి కోపం, ఉడుకుమోత్తనం కంఠం పూర్తిగా వచ్చాయి పాపం.

"ఎప్పుడో ఈలాగే ప్రాణం పోయాక వద్దురుగాని అంతా ! పిల్చి పిల్చి గొంతు తడారిపోయింది. కాస్త గ్లూకోజ్ నీళ్ళు పొయ్యండి ! అన్నది అవ్వగారు దుఃఖం దిగమ్రింగుకుంటూ.

అప్పుడే ఊర్నించి వచ్చాడు వంశీ యూనివర్సిటీలో చదువు ముగించుకుని. బామ్మ దయనీయ పరిస్థితి అతని లేత గుండెని కలచివేసింది.

బామ్మా ! ఎలా ఉన్నావ్ పరుగును వచ్చాడు దగ్గిరికి చేతుల్లో సంచులు ఆపాటున వదిలేసి ! ఆవిడ ముఖంలో కొండంత సంతోషం కొట్టవచ్చినట్లు కనబడుతోంది.

బోసినోరు విప్పి హాయిగా నవ్వింది. తన దిగులును మర్చిపోయి.

సెలవలిచ్చేరా ? చదువైపోయిందా అన్నారావిడ !

బాగున్నాను బామ్మా ! చదువైంది ! ఇంక ఉద్యోగం దొరికే దాకా అంతా సెలవే ! అన్నాడు ప్రక్కన కూర్చుని నోట్లో కారుతున్న చొంగ తుడుస్తూ !

ఆ దృశ్యం చూస్తూ సీత మూతి తిప్పుకోకుండా ఉండలేక పోయింది. పరీక్షలని చాలా రోజుల తర్వాత వచ్చినవాడు తల్లినైన తనని కూడా పలుకరించకుండా బామ్మ ప్రక్కన కూర్చున్నాడని సీతకి కినుక.

అది వంశీ దృష్టిని దాటిపోలేదు. మనసులో నవ్వుకున్నాడు.

అమ్మా ! అమృతం లాంటి నీచేతి కాఫీ తాగి ఎన్నాళ్ళయిందో ! అన్నాడు. ఇంత మోహం అయ్యింది. అంతే ! ఉండరా ! చిటికెలో తెస్తానంటూ సీత అటు వెళ్ళింది. ఇటు ఆఫీసునుంచి విష్ణుమూర్తి వచ్చి "ఏరా వంశీ ! ఇదేనా రావడం ! పరీక్షలు బాగా రాశావా !" అంటూ తల్లి ప్రక్కనే కూర్చున్నాడు.

అతనికి ఆఫీసు నుంచి రాగానే తల్లిని పలుకరించడం అలవాడు. తనకి చెరో ప్రక్కా కూర్చున్న కొడుకునీ, మనుమడినీ చూసుకుని మురిసిపోతోంది ఆవిడ.

అంతలో రెండు కప్పులు చెరో చేత్తోనూ పట్టుకొచ్చి తండ్రీ కొడుకులిద్దరికీ చెరొకటీ అందించింది.

"అరె ! నేనొచ్చినట్లు ఎలా తెల్సిందోయ్ !" అన్నాడు విష్ణు ఆశ్చర్యం ప్రకటిస్తూ.

"మరే ! కర్ణ పిచాచి చెప్పింది లెండి ! తమరు ఆఫీసు నుంచి రాగానే అమ్మ ప్రక్కన కూర్చుని అమ్మా ! ఈ రోజు మందులన్నీ వేసుకున్నావా !" అని రోజూ అడిగే ప్రశ్న నాకేకాదు నాలుగిళ్ళ అవతలికి వినబడుతుంది. ఆమాట చుట్టుప్రక్కల వాళ్ళు చెబుతూ ఉంటారు కూడా ! తల్లి మీత తమరికున్న శ్రద్ధాభక్తుల్ని మెచ్చుకుంటారు కూడా! ఇరవై నాల్గు గంటలూ ఇంట్లో ఉండి చూసేవాళ్ళ సంగతి వాళ్ళకేం తెలుస్తుంది ?

వెంటనే "వంశీ ఇప్పుడే కదా వచ్చాడు ! చుట్టు ప్రక్కల వాళ్ళింటికి తరువాత వెడతాడులే !" అవ్వగారు అన్న మాటలకి విష్ణు "వాడి మాట కాదులే !" అంటుంటే, "చెవిటిమేళంతో చస్తున్నాం ! అన్నీ ఆవిడకే కావాలి ! అందుకే ఒక్క నిమిషం నిలువటం లేదు !" అని సణుక్కుంటూ లోపలికెళ్ళిపోయింది సీత ! తల్లా - పెళ్ళామా అన్నట్లు దిక్కులు చూస్తున్న తన తండ్రిని జాలిగా చూశాడు వంశీ.



అమ్మ ఎందుకలా విసుక్కుంటుంది బామ్మ మీద ? అసలు పేరుకు తగ్గ ఇల్లాలు. చాలా మంచిది అని బంధువర్గంలో పేరు తెచ్చుకున్న 'అమ్మ' ఒక్క ఈ విషయంలోనే అసహనం ప్రదర్శిస్తుంది.

తన భర్త, కొడుకూ తనపైనే ఇష్టంగా ఉండాలి. వాళ్ళిద్దరూ వారి ప్రేమను ఇతరులకి పంచకూడదు అన్న స్వార్థం కనబడుతుంది. తను వారి అభిమానానికి దూరమై పోతానేమో అన్నట్లు ప్రవర్తిస్తుంది. ఇటువంటి సైకాలజీ ప్రతీ స్త్రీకీ ఉంటుందా?

నాన్న కూడా బామ్మకి కొడుకే కదా ! తన కొడుకు తన్ని ప్రేమించాలి అని తను ఎలా అనుకుంటోందో అలాగే కోరుకోడం ప్రతి తల్లికీ జన్మహక్కే కదా ! ఈ సమస్యకి అనాదినించీ కూడా పరిణామం కనిపించదు. పరిష్కారం తోచదు. రేపు తను పెళ్ళి చేసుకున్నా ఇలాంటి సమస్యలు ఎదుర్కోవలసిందేనా ?

"వంశీ ! వెళ్ళి కాళ్ళు కడుక్కుని ప్రయాణం బట్టలు మార్చుకో. రాగానే ఇక్కడే కూర్చుండిపోయావు !" బామ్మగారు హెచ్చరించడంతో వంశీ లేచాడు అక్కణ్ణించి.

మూడు రోజులు అదేపనిగా ఆలోచించిన వంశీకి ఒక ఆలోచన వచ్చింది. వెంటనే తండ్రితో చెప్పాడు.

నాకుగా నేను చెయ్యలేకపోయాను. అలా చేస్తే అటు ఆ ముసలి ప్రాణానికి హాయిగా ఉంటుంది. ఇటు ఇంట్లో కాస్త ప్రశాంతంగా ఉంటుంది.

ఆ మర్నాడే ప్రక్క ఊరిలో ఉన్న వృద్ధాశ్రమంలో బామ్మని చేర్పించి, ఆవిడ శుశ్రూషకి ప్రత్యేకించి ఒక ఆయాని నియమించి వచ్చాడు. వచ్చేస్తుంటే తనేమైనా తప్పు చేశాడేమో అనిపించి మనసు భారంగా అయిపోయింది. మళ్ళీ ఎప్పుడొస్తావ్ ! అని అడుగుతూంటే జాలేసింది.

కానీ ప్రస్తుతపు జీవన విధానంలోని వేగానికి తట్టుకోలేక తమ పిల్లల్నే 5, 6 ఏళ్ళ నుంచీ రెసిడెన్షియల్ స్కూళ్ళలో పెట్టి చదివిస్తూంటే తను కేవలం బామ్మ మేలు కోరి చేసిన పనిలో తప్పు లేదనిపించింది.

వారం తిరగ్గానే బామ్మని చూడడాన్కి వెళ్ళాడు వంశీ !

బామ్మ మాటల్లో ఇదివరకటి నైరాశ్యం కనిపించలేదు వంశీకి. పైగా చాలా రోజుల తర్వాత బోలెడు కబుర్లు చెప్పింది. ఈవారం రోజుల్లో తనకి పరిచయమైన

వాళ్ళందరి గురించీ చెప్పింది. అక్కడ అందరూ ఇంచుమించు తనలాంటి వాళ్ళే కావడం కూడా బామ్మకి తనమీద తను పొందే సెల్ఫ్ పిటీ తొలగిపోడాన్కి కారణం కావచ్చు అనిపించింది. వాళ్ళందరూ తను లేచి తిరగలేదు కనుక వాళ్ళే తన గదికి వచ్చి తలో కాస్సేపూ కబుర్లు చెబుతున్నారని, బోలెడు కాలక్షేపంగా ఉంటోందని చెప్పింది.

ఆయా ఎప్పుడూ తనకి అందుబాటులో ఉండడంతో పెద్దగా పిలిచే అవసరం కూడా లేక ప్రాణానికి హాయిగా ఉందిరా వంశీ ! అంటున్న బామ్మ కళ్ళల్లో తృప్తే కనిపించింది కాని మరోభావం తోచలేదు.

పసిపిల్లలు వాళ్ళకి కావలసినట్లు జరగాలనే కోరుకుంటారు తప్ప పెద్దవాళ్ళ ఇబ్బందులు అర్థం చేసుకోరు. చేసుకోలేని వయసు కూడా వాళ్ళది.

ముసలి వాళ్ళయ్యాక అదే మనస్తత్వం మళ్ళీ ఏర్పడుతుంది కాబోలు. ఎదుటి వాళ్ళ ఇబ్బందులు అర్థం చేసుకోగలరు కానీ ప్రయత్నించరు. వాళ్ళ అవసరాలకి పిల్లల మీద ఆధారపడవలసివస్తోందే అని బాధ ఒకవైపు ఉన్నా ఎందుకు చెయ్యరు ? అనే భావం కూడా వారిలో ఎక్కువగా ఉండబట్టే ఈ తరాల అంతరాలు ఏర్పడుతున్నాయేమో! వంశీ ! వంశీ ! బామ్మ పిలుపుకి వంశీ ఈలోకంలోకి వచ్చాడు.

"ఏమిరా వంశీ ! ఇంట్లో అంతా బాగున్నారా ! మధ్యలో మీనాన్న ఒకసారి వచ్చి వెళ్ళాడు. ఈమాటు వచ్చినపుడు మీ అమ్మని కూడా తీసుకురా ! పాపం ! ఇంటిపనితోబాటు నాపనులతోనూ తంటాలు పడేది ! మిమ్మల్నందర్నీ కష్టపెట్టవలసి వస్తోందని బాధపడేదాన్ని, కానీ ఏం చెయ్యను. ఈ విధంగా మంచాన పడేశాడు దేవుడు ! అప్పుడప్పుడు మీరు కనబడుతూంటే చాలు ! నాకు ఏ బెంగా ఉండదు. డబ్బు ఖర్చు ఔతోంది అనుకో. అయినా నేను నావాళ్ళకి కష్టం కల్గించడం లేదు. అదే మనసుకి ఎంతో తేలికగా అనిపిస్తోంది."

హమ్మయ్య ! నేను తప్పు చెయ్యలేదు. ప్రతివారికీ తప్పనిది ముదిమి. అది శాపంగా మారకుండా సుఖంగా సాగిపోయేలా చేసుకోడం మన చేతుల్లోనే ఉంది. అనుకున్నాడు వంశీ.



# సరళరేఖ

చుట్టూ చీకట్లు ముసురుకుంటున్నాయి ఆమె మనసులోలాగే. బయటినించి వస్తూనే వంట్లో ఓపిక కూడా లేనట్లుంది. కాసిన్ని పాలు త్రాగేసి అలసటగా మంచం మీద అడ్డంగా వాలిపోయింది మాలిని. "అమ్మా !" అంటూ బేలగా చూసే 'బేబీ' ముఖమే గుర్తు వస్తోంది మాటిమాటికీ. కళ్ళు మూసుకున్నా ఏవో ఆలోచనలు బుర్రని దొలిచేస్తున్నాయి. ఏదో వెలితిగా ఉండి ఒంటరి తనం ఒక్కొక్కసారి మనిషిని నిలువునా కృంగతీసేస్తోంది.

బ్రతుకుతెరువు కోసం ఏదో విధంగా ఒక చిరుద్యోగం సంపాదించిందే కాని, రోజూ తెల్లవారుఝామునే లేచి ఉరుకులు పరుగులు పెట్టాలంటే జీవితం మీదే విరక్తి పుడుతోంది. బేబీ అమ్మమ్మ దగ్గర అలవాటైంది. ఇంక తనీ తనువు చాలించినా ఫరవాలేదు. ఆత్మహత్య ఆలోచనలు. అలాంటప్పుడే ఏదైనా పుస్తకం చదవడం మాలినికి అలవాటు. మంచి పొత్తము మించిన మిత్రము వేరే లేదన్నది తన నమ్మకం. చిన్నప్పటి నించీ పుస్తకాలు కొని చదివే మంచి పద్ధతి మాలిని అవలంబించేది. అందువల్ల రేక్ నిండా బోలెడు పుస్తకాలుంటాయి. బాగా నచ్చితే చదివినవే చదువుతూంటుంది కూడా!

మంచం ప్రక్కనే సగం చదువుతూ వదిలిన క్రొత్త పుస్తకం 'కథాకుసుమాలు' తీసింది చదవడాన్కి. అందులో పదో, పన్నెండో కథలున్నాయి ఆ రచయిత్రి తన చిరుప్రాయం నుండి వృద్ధాప్యం వఱకు అప్పుడప్పుడు రాసిన కథలన్నీ కూర్చి ప్రచురించినందువల్ల ఒక్కొక్క కథ ఒక్కొక్క రీతిలో కాల, మాన పరిస్థితులలోనూ,

రచనలోనూ వైవిధ్యం కనబడుతూంది అనుకుంటూ పేజీలు త్రిప్పుతూండే 'వక్రరేఖ' అనే టైటిల్‌తో కథ కాస్త గ్రాంథిక భాషలో కనిపించేసరికి మొదలు పెట్టింది.

* * *

బాల భాస్కరుడు తిమిరమును తరిమివేసి విశ్వమును వినూత్న వికాసమున ప్రకాశింప జేయుచున్నాడు. ఉదయభానుని నును లేతకిరణ ప్రసరణచే మంచు బిందువులతో నిండిన ఆకులు వివిధ వర్ణాలతో మెరియుచు ప్రకృతి శోభను ఇనుమడింప జేస్తున్నాయి. నవనవలాడే ఆ వనములో కువకువలాడే పక్షుల సందడి.

క్రొత్త ప్రపంచాన్ని చూచుటకా యన్నట్లు అప్పుడే విచ్చుచున్న మొగ్గలు కొన్ని, సువాసనలు వెదజల్లుతున్న అరవిచ్చిన కుసుమాలు కొన్నిటితో ఉన్న లతానికుంజములు, ఫలా భారముచే నిండు చూలాళ్ళవోలె నిండైన వృక్షరాజములతో వనమంతా సుందరముగా నుండెను.

సూర్యరశ్మిచే జలాశయములందలి కమలములు ప్రఫుల్ల వధనములతో వింత గొలుపుచుండెను. అట్టి శుభోదయాన శోభాయమానమైన ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ అవ్వనమున ఒక జవ్వని విహరించుచుండెను. ఆ లతాంగితనూవల్లరి బంగరు తీగెను బోలియుండెను. మలయ సమీరముచే ఆమె ఫాలభాగమున ముంగురులు మయూర నృత్యములు చేయుచుండెను. తామరతూడులు వంటి బాహువులు, విశాల నేత్రద్వయము ఆమె సౌందర్యమును ద్విగుణీకృతము చేయుచుండెను. హంస యానయై మెలమెల్లగ తిరుగాడునామె యెద్దియో సవ్వడికాగ యొక పూపొదరింట దాగి ధ్వని వచ్చిన వైపు పరికించెను.

లేడిని తరువుకొనుచు వచ్చిన అమ్మహీపతి జయవర్మ పాదమాటున కదలిక గమనించి వింటిని సంధించ బూనునంతలో నప్పూబోడి భయవిహ్వలయై బయటకు వచ్చెను.

ఆ భీతహరిణేక్షణను తిలకించిన రాజు దిగ్భ్రాంతి నొంది కొంతదనుక తేరుకుని "సుందరీ ! నీవెవ్వరు ? అంతఃపురములో వసింపవలసిన నీవు ఈ వనాంతరము లందుండుటకు కారణంబెద్ది ? హంసతూలికా తల్పముల పవ్వళించవలసిన సుకుమారివి నీవీ కటికనేలను వనాంతర సీమల నడయాడుచుండ నీపద పంకజములు వాడిపోవు కదా ! సుధాంసునివోలె ప్రేమామృత ధారలు



కురిపించు నీ కన్నులు కాంచినంతనే నా మానస సరోవరమున వేయి కలువలు వికసించినవి. ప్రథమ వీక్షణముననే నీ ప్రేమ భిక్షకై అర్థించునట్లు చేసితివి." సుందరీ! నీ నామధేయమెద్ది ? అన్నాడు రాజు.

నునుసిగ్గు దొంతరల నడుమ యా లలన రేని నొకపరి క్రీగంట వీక్షించి మందస్మిత వదనారవిందమై "సుందరీ ! అంటిరి కద ! అదియే నామము. అని, తమ రాజ్యము పరహస్తగత మైనందున శత్రువులకు చిక్కకుండా తలొక దారిని పట్టుటలో తానీ వనమధ్యమున నివసింపవలసి వచ్చి"నట్లు చెప్పి మిన్నకుండెను.

అంతట నా రాజు మహదానంద భరితుడై నీకంగీకారమైనచో నీమృదు పల్లివపాణిని గ్రహించి ఈ పంచ భూతముల సాక్షిగా గాంధర్వ విధిని నిన్ను వివాహమాడెదను. అను నంతట నామె మౌనముగా నిలుచుండె. అమ్ముదిత మౌనమే అంగీకారముగ నెంచి ఆమెను గాంధర్వ వివాహమాడి రాజు ఆలలనామణి లాలిత్యంలో కేళీవిలాసముల లోలలాడుచూ రాజ్యపాలనా విషయమే విస్మరించెను. వినీలాకాశము చెమికీ బిళ్ళలద్దిన జల్తారు చీర ధరించినట్లు తళతళలాడు తారకలతో ప్రకాశించుచుండెను. మలయా నిలుడు మందగతిని వీచుచుండెను.

ఆహ్లాదకరమైన అట్టి వాతావరణములో ప్రసన్నవదనయై యుండుటకు బదులు సుందరి చిన్నబోయిన ముఖముతో నుండుట రేడు గమనించెను.

"ఇందువదనా ! అంబరమున కారు మేఘములు క్రమ్మినప్పుడు కళలుడుగు కలువ బాంధవునివలె నీ వదనము మ్లానమై యున్నది. కారణమేమైనది. సంకోచము వీడి చెప్పవలెను. సుమా !" యనెను. రాజుకు సుందరే సర్వస్వము మరి !

"నాదు జననీ జనకులు గుర్తు వచ్చిరి. అంతియే ! కాని వేరొండు లేదు." ముక్తసరిగా అంది సుందరి.

అంతలో అశ్వారూఢులై యిరువురు యోధులు వచ్చి నిలిచిరి. వెనువెంటనే వారు అశ్వములు దిగి మహరాజుకు అభివాదము తెలిపి, "మహారాజా ! తమరు రాజ్యము వదిలి నెల దినములైనది. మహారాజ్ఞి ఆజ్ఞ మేరకు మేమిక్కడి కరుదెంచితిమి. దేవి గారు తమకీ పత్రము సమర్పించమన్నా"రని ఒక లేఖ అందించెను.

మహారాజు ధర్మపత్ని స్వహస్త లిఖితమైన యా లేఖను చదువ దొడంగెను.

"ప్రాణేశ్వరుల పాదపద్మములకు నమస్కృతులు.

వేటకు తమతో వచ్చిన వారి వలన మీ విషయము తెలిసినది. ఆ కాంతతో మీ యేకాంతమునకు భంగము వాటిల్లరాదని ఇన్ని దినములు వేచి యుంటిని. మీ పరోక్షములో ప్రజలు క్రమశిక్షణా రాహిత్యముగా నుండుటకు అవకాశము కల్గుచున్నది. తండ్రిగారిని చూసి మాసము దినములైనందున పిల్లలిద్దరు మానసమున దిగులు పడుచుంటిరి. తమ దర్శన భాగ్యమునకు దూరమై ఈ బేల హృదయము శ్రావణ మేఘావృతమై సంతత ధారావృష్టి కురిపించుచున్నది. మీ విరహాగ్నికి మిడుతలా ఆహుతినై పోతినేని బిడ్డలకు తల్లిప్రేమ కూడా కరువగును కదా !

త్వరలో తమ దర్శన భాగ్యము కల్గించవలసినదిగా మా ప్రార్థన. సపత్నీ సమేతముగా విచ్చేయు తమకు స్వాగత సత్కారములు సలుప సన్నద్ధనై యుందును.

చిత్తగించవలెను.

ఇట్లు మీ ధర్మపత్ని సుమతి.

* * *

కథ పూర్తయింది. మాలికిని కన్నీళ్ళాగలేదు. ఏ కాలంలో జరిగినా గొప్పవాళ్ళల్లో యైనా మధ్యతరగతి వాళ్ళల్లోనైనా అబల అగచాట్లు ఒకటేనన్నమాట. రాజులకైనా సామాన్యులకైనా సమస్య ఒకటే. గ్రాంథికంగా చెప్పినా అనాదిగా అచ్చతెలుగులో చెప్పినా ఆడదంటే అలుసే ! అలాగే అనుస్మృతంగా చరిత్ర పునరావృతమౌతోంది.

ఈ కథలో సుమతి పాత్రికీ తనకీ చాలా పోలికలున్నాయి. తన కథ ఆనాటి ఆమె కథకన్నా అన్యాయం. నేటి మహిళ కూడా భర్త దురాగతాలకి ఆహుతి ఐపోవలసిందేనా ? లేదు వీల్లేదంటూ తనలాగా ఏ ఒక్కరో ఎదురు తిరిగితే తన్నులు, తలవంపులు. ఇదేనా నేటి సమాజంలో స్త్రీ పొందగల్గింది ?

ఆకుచాటు పిందెలాగా బ్రతుకు వెళ్ళదీయాల్సిందేనా ? చిరుత ప్రాయంలో తండ్రి, యౌవనంలో భర్త వృద్ధాప్యంలో బిడ్డలు అండ లేకుండా ఉండలేదా ? తమకి అటు డిగ్రీ పూర్తయిందో లేదో వ్యాపారం చేస్తున్నాడు. పిల్లాడు బాగున్నాడు వగైరా వగైరా చెప్పి వాళ్ళు అడిగినంత కట్నం ఇచ్చి మాధవతో పెళ్ళి జరిపించారు తల్లిదండ్రులు.



పెళ్లైన 5, 6 ఏండ్లు తన కాపురం చాలా హాపీగా సాగింది. బేబీ పుట్టి ఐదవ నెల వచ్చాక తనను పిల్లని తీసుకుని వెళ్ళి దించి ఒక పదిరోజులుండి మాధవకి ఎన్నో జాగ్రత్తలు చెప్పి అప్పగింతలు పెట్టి వెళ్ళారు అమ్మా నాన్న. వాళ్ళు వెళ్ళాక మాధవ రోజు రాత్రి బాగా ఆలస్యంగా వస్తూనిడడమే కాకుండా, బాగా తాగి వస్తున్నాడని తెలుసుకుని కుమిలిపోయింది. ఆలస్యానికి కారణం ఏమిటని అడిగితే బిజినెస్‌లో ఖాళీ ఉండడం లేదంటే కాబోలు అనుకుంది. త్రాగుడు అలవాటైందా ! అంటే, ఔను ! ఐతే ఏంటి ? అని ఎదురు ప్రశ్న ! సరే దానికీ సర్ది చెప్పుకుంది.

ఇంట్లోకి కావలసినవి చూడడం, పిల్లనీ, తననీ పట్టించుకోడం లాంటివి చెయ్యపోయినా, మెల్లిగా అలవాటవుతుందిలే ఈ మధ్య తను లేక ఇలా తయారయ్యాడు కాబోలు అనుకుంది.

రాత్రికి పిల్లకి పాలడబ్బా అయిపోతుంది అని హడావిడిగా ప్రక్క వీధిలోని స్టోరు కెళ్ళింది ఒకరోజు. అక్కడ మాధవ ఇంకో అమ్మాయితో చాలా క్లోజ్‌గా మూవ్ ఔతూ కనిపించాడు. వాళ్ళు తనని చూడకుండా గబగబా డబ్బా తీసుకుని వచ్చేసింది.

ఆ మర్నాడే ఆ అమ్మాయిని ఇంటికి తీసుకుని వచ్చి తన స్నేహితుని చెల్లెలు వనజగా పరిచయం చేశాడు. బలవంత పెట్టి భోజనానికి ఉంచేసి తనచేత హడావిడిగా 4, 5 రకాలు ఆమెకిష్టం అంటూ చేయించి పెట్టాడు. క్రొత్తగా ట్రాన్స్‌ఫర్ అయి మీ ఊరు వస్తోంది మా చెల్లెలు వనజ. జాగ్రత్తగా చూడమని వాళ్ళ స్నేహితుడు ఉత్తరం రాశాడంటూ అందుకనే కాబోలు మాధవకి అంత శ్రద్ధ అనుకుంది అప్పుడు కూడా.

భోజనాలైనాక వనజని వాళ్ళ ఇంటి దగ్గర దింపి వస్తానని కూడా వెళ్ళిన వాడు తెల్లవారే వఱకు రాకపోతేనే తనకి అనుమానం వచ్చింది.

వనజని దింపి వచ్చేస్తూంటే త్రోవలో ఎవరో ఫ్రెండు కనిపించి సెకండ్‌షోకి లాక్కుపోయాడని, అర్ధరాత్రి అంతదూరం ఏం వెడతావులే అని తన రూమ్‌లో ఉండి పొమ్మన్నాడని తెలిపితే అప్పుడది ఉత్త కట్టుకథ అనిపించలేదు. ఎలాగోలా రెండేండ్లు గడిచాయి.

అప్పుడప్పుడు రావడం, ఒక ప్రక్క పిల్ల ఏడుస్తున్నా మంచి మంచి మాంసాహారం తయారు చేయించి ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ విందు ఆరగించి

వెనకాల తను ఇంకా తినవలసి ఉన్నదన్న స్పృహ కూడా లేకుండా గిన్నెలు ఖాళీ చెయ్యడం చూసి మెల్లగా తన మనసు విరగడం మొదలు పెట్టింది.

అక్కడి విషయాలు తల్లిదండ్రులతో చెప్పుకుంటే ఉపశమనం కలిగేదేమో! కాని వాళ్ళని కూడా కష్టపెట్టడం ఎందుకని ఊరుకుంది. కానీ ఇలాంటి విషయాలు చాలా త్వరగా వ్యాపిస్తాయి అనడానికి నిదర్శనంగా తల్లి దగ్గర్నించి నాన్నకి బాగోలేదు వెంటనే రమ్మని ఫోను వచ్చింది. మాధవని రమ్మంటే వనజకి జ్వరంగా ఉంది. తనని ఒక్కత్తెనీ వదిలేసి ఎలా రావడం, నువ్వెళ్ళు అనడంతో పాపను తీసుకుని బయలుదేరింది.

అలా వచ్చిన తను మళ్ళీ నెల వఱకు వెళ్ళలేక పోయింది. తన కాపురం విషయం తెలియడంతో తట్టుకోలేని నాన్నకి హార్ట్ఎటాక్ రావడం, చనిపోవడం జరిగిపోయింది. ఆ పోయినప్పుడు ఒక్కసారి వచ్చివెళ్ళిపోయాడు మాధవ అంతే.

అమ్మని వంటరిగా వదిలి రాలేక 3వ నెల వచ్చాక అమ్మని, పాపని తీసుకుని తను వెళ్ళేక మాధవ పూర్తిగా ఇంటికి రావడం మానేసి వనజతోనే ఉండిపోతుంటే అమ్మ, తను ఏడ్చుకుంటూ, ఒకరినొకరు ఓదార్చుకుంటూ ఉండిపోయారు కొన్నాళ్ళు. చివరికి అతని తండ్రితో చెబితే మగవాడు, వాడిష్టం వచ్చినట్లు తిరుగుతాడు, వాడు మేం చెబితే వినే ఘటం కాదు. మీ తిప్పలేవో మీరు పడండి అన్నారని అమ్మ ఒకటే బాధ పడింది.

ఇటువంటి సమస్య వాళ్ళ కూతురికే వస్తే అలా అంటారా ! అనరు ! ఏదైనా పనిమీద బయటకు వెళ్ళినప్పుడు, సిటీబస్సులోనూ జంటగా కనబడుతూనే ఉంటారు. అమ్మా తనూ బాధని కప్పిపుచ్చుకుని ఏమీ ఎరగనట్లు ప్రవర్తించడం అలవాటు చేసుకున్నా అప్పుడే బాగా తెలుస్తున్న బేబీ మాత్రం నాన్న ! నాన్న ! అంటూంటుంది. అలాంటప్పుడు వెయ్యి ముక్కలౌతున్న మనసుతో దాన్ని మరిపించడానికి వడేపాట్లు చెప్పుకోడానికి భాషలేదు.

ఇంక ఈ ఊర్లో ఉండి ఏం చేస్తాం. మన ఊరికి పోదాం అంటుంది అమ్మ. ఎదురుగుండా కనిపిస్తూంటే ఒకసారి కాకపోతే ఒకసారైనా బుద్ధి మారవచ్చని తన ఆశ! పైగా ఆ పల్లెటూరిలో బంధుజనాల మధ్య వాళ్ళడిగే ప్రశ్నలకి జవాబులు చెప్పలేక సతమతమవడం కన్నా తనకిదే నయమనిపిస్తుంది.



కానీ ఈ రోజు సిటీబస్సు ఆప్రక్కనించి వనజ, మాధవ, ఈ ప్రక్కనుంచి తను ఒక్కసారే ఎక్కి కూర్చోడానికి చోటులేక నిలబడవలసి వచ్చేసరికి బేబి నాన్న ! నాన్న అంటూ చేతులు జాపుతుంటే అతను దిక్కులు చూడడం, అందరూ వింతగా తమనే గమనించడం తనకీ తల కొట్టేసినంత పనైంది. వెంటనే నెక్స్ట్ స్టాపులో తను దిగేసింది. బేబి నాన్నా అని ఏడుపు మానలేదు. తల్లిగా తన గుండె తరుక్కుపోయింది. ఆ క్షణంలో అది ఏమడిగినా ఇవ్వడానికి ప్రయత్నించ గలదు కాని కఱకు గుండెల తండ్రి దగ్గరికి ఎలా చేర్చగలదు ? తన అసమర్థతకి తనమీద తనకే కోపం వచ్చి బేబీని రెండు దెబ్బలు వేసింది. అది ఏడ్చి ఏడ్చి పడుకుంది. చారికలు కట్టిన దాని ముఖం చూసిన తన గుండెలు పిండినట్లైంది. మనసు వికలమైంది. ఈ పరిస్థితులలో సుమతిలా సవతిని భరించలేదు. అలాగని బ్రతుకు చాలించుకోవడం పిరికిదాని లక్షణం.

అలాగని నీలెక్కేమిటని నిలబడడాన్కి ధైర్యం చాలడంలేదు. మాధవ ఉన్నప్పుడు వసతిగా ఉండేందుకని పెద్దఇల్లు తీసుకున్నాడు. ఇప్పుడా అద్దె కట్టడం కూడా తనకి కష్టంగా ఉంది. ఏదో ఒక మార్గం చూడాలి. బేబీ కోసమైనా తను బ్రతకాలి ! దాన్ని పెంచి పెద్ద చేసి ఉన్నత విద్యలు చెప్పించి ఉత్తమ శ్రేణిలో నిలబెట్టాలి. అని తనలో తనే శపథం చేసుకుంది మాలిని.

ఆ మర్నాడు మాధవ వచ్చాడు. ముందు రోజు తనకసం పాప ఏడ్చినప్పుడు పక్కనే వనజ ఉండబట్టి అలా ప్రవర్తించాడు గానీ బేబీ మీద తండ్రిగా తనకి ఆమాత్రం ప్రేమ ఉండదా అనుకుంది తను. అందుకే కాబోలు స్త్రీ హృదయం అమృతంతో పోల్చారొక కవి. కట్టుకున్న భర్తని కడవఱకు గుడ్డిగా నమ్మేది ఆడమనసు.

కానీ ... తన నమ్మకం మీద దెబ్బ కొట్టినట్లు వనజని తను పెళ్ళి చేసుకోదల్చుకున్నానని విడాకులివ్వడానికి అంగీకరిస్తూ సంతకం చెయ్యమని చెప్పి కాగితాలు చేతికిచ్చాడు. మాలిని ఒక్కసారి అతని కళ్ళల్లోకి సూటిగా చూసి చటుక్కున సంతకం చేసేసి ఇంక తక్షణం వెళ్ళవచ్చు అన్నట్లుగా చూసింది. మటాడకుండా మాధవ వెళ్ళిపోయాడు.

విషయం గ్రహించిన మాలిని తల్లి లబోదిబోమంది. మాలిని తల్లికి ధైర్యం చెప్పి నిశ్చలమైన మనస్సుతో ఆ ఊరు విడిచిపెట్టి పల్లెకు వెళ్ళి ఉన్న కొంద్ర కాస్తా

అమ్మేసి తల్లినీ, పాపనూ తీసుకుని హైద్రాబాద్ నగరం చేరింది.

తన వద్ద ఉన్న డబ్బుకు తోడు స్వయం ఉపాధి పథకం క్రింద బ్యాంక్ లోన్ పొంది చిన్నగా క్రొవ్వొత్తులు, దోమల నివారణకు వాడే కాయిల్స్ తయారు చేయడం లాంటివి ప్రారంభించి, తనలాంటి వారి మరో ఇద్దరితో, బట్టల సబ్బు, సబ్బు పొడి మొదలైన ప్రొడక్ట్స ప్రారంభించి అభివృద్ధి సాధించింది. లక్ష్యశుద్ధితో, ఆత్మవిశ్వాసంతో ఏమైనా సాధించవచ్చని నిరూపించింది. అలా కాలగర్భంలో మరో ఇరవై ఏళ్ళు గడచి పోయాయి. మాలిని తల్లి చనిపోయింది. మాలినికి తన కూతురు బేబియే అన్నీను. అనుకున్నట్లుగా డాక్టరు చదివించింది. తగిన వరుణ్ణి చూసి కూతురి పెండ్లి చేసేస్తే తన బాధ్యత తీరిపోతుంది అనుకుంది మాలిని.

'వక్రరేఖ' కథ చదివిన తర్వాత మాలిని తన జీవితం వక్రరేఖ కాకుండా సరళరేఖలా తీర్చిదిద్దుకుంది. తల్లి గతం తెలుసుకున్న బేబీ తాను అవివాహితగానే ఉండి సమాజ సేవ చేస్తాను అంటుంది. తరాలు మారుతూంటే అంతరంగాలలో మార్పు సహజమేనేమో !!



# సమస్య

ఆకాశం నిర్మలంగా ఉంది. అక్కడక్కడా తెల్లని మబ్బు తునకలు. దూది పింజల్లా కదులుతున్నాయి. ప్రయాణీకులంతా టైమ్ మార్చుకోండి ! దయచేసి సేఫ్టీ బెల్టులు కట్టుకోండి. మరికొద్ది సేపటిలో విమానం 'చికాగో' ఎయిర్ పోర్టులో లాండ్ అవబోతోంది అని ఎనౌన్స్‌మెంట్ వినబడింది. వరలక్ష్మికి ఒక విధమైన ఉద్వేగం కలిగింది. షుమారు 5, 6 సంవత్సరాల తర్వాత తనకుమారుడు మోహన్‌ని చూడగల్గుతోంది ! చదువుకని వచ్చి వెంటనే ఉద్యోగం దొరకడంతో అమెరికాలోనే ఉండిపోయాడు. తనకి సెలవు ఎక్కువ దొరకదని "అమ్మా ! నువ్వే వస్తే ఐదారు నెలలపాటు కలిసిఉండే అవకాశం ఉంటుంద"ని చెప్పి టిక్కెట్టు దగ్గర్నించీ పంపడం, తను ఇలా బయలుదేరడం చాలా తమాషాగా జరిగిపోయింది. లేకపోతే మారుమూల పల్లెనుంచి ఏకంగా అమెరికాకి విమానంలో ఒంటరిగా ప్రయాణం చేసిరావడమేమిటి ? ఇలా ఆలోచనల్లో మునిగిపోయిన వరలక్ష్మికి "మీరింకా బెల్టు పెట్టుకోలేదు. నేను హెల్ప్ చెయ్యనా !" అంటున్న ఎయిర్ హోస్టెస్ కమ్మని స్వరం వినిపించింది.

ఇంగ్లీషులో మాట్లాడడం అంతగా అలవాటు లేని కారణంగా బదులేమీ చెప్పకుండా గబగబా బెల్టు కట్టుకోసాగిన వరలక్ష్మికి సహాయం చేసి నవ్వుతూ ఇంకో పది నిమిషాలలో మీరు మీ వాళ్ళని కలుసుకోబోతున్నారుకదూ హావ్ ఎ నైస్ టైమ్ అంటే 'థాంక్యూ' అని మాత్రం అంది. నిజమే ! ఆ డిగ్రీ అయినా వెలగబెట్టబట్టి మాట్లాడుతూంటే కాస్తైనా అర్థమౌతోంది అనుకుంది మనసులో.

వేగం తగ్గింది. విమానం మెల్లిగా క్రిందికి దిగుతున్నట్లు తెలుస్తోంది. ఓహ్! ఎంత అద్భుతంగా ఉంది పైనించి చూస్తూంటే అంతటా ఆకుపచ్చని తివాసీలా మధ్య మధ్య గీతల్లా కనిపించే రోడ్లపైన చిన్నసైజు కార్ల పరిమాణంలో కనిపిస్తున్నాయి.

అంగుళ ప్రమాణంలో మనుష్యులు, అడుగు ఎత్తున్నట్లున్న వృక్షాలు - అంతా వింతగా తోచింది. ఎంతో సంతోషంగా కూడా అనిపించింది.

మెల్లిగా విమానం లాండ్ అయ్యింది. ప్రయాణీకులు కట్టుకున్న బెల్టుల్ని ఊడదీసి ఎవరి కారీఆన్ వాళ్ళు భుజాలకి తగిలించుకుని దిగడానికి తయారౌతున్నారు. షుమారు 300 మందికి పైగా ఉన్నారేమో ఒక్కొక్కరూ బయట పడేసరికి చాలా టైము పట్టింది. వీసా టిక్కెట్టు జాగ్రత్తగా ఉన్నాయో లేదో ఒకసారి చూసుకుని తను కూడా బయలుదేరింది.

మళ్ళీ అన్ని ఫార్మాలిటీస్ పూర్తయి లగేజ్ కార్‌లో వేసుకుని అందరిలాగే తానూ తోసుకుంటూ బయటకు వచ్చేసింది గాని ఆ తర్వాతే ఖంగారు మొదలైనిది. ఒకవేళ ఆ మోహన్ తనకోసం రాలేకపోతే తన దేశం కాని దేశంలో ఏం చేయాలి. తనభాషా పరిజ్ఞానం కూడా అంత మాత్రమేనయ్యె ! పరిపరివిధాల పరుగులెత్తే ఆలోచనలతో కళ్ళింత చేసుకుని చూస్తోంది నాలుగు వైపులా మోహన్ కోసం. చుట్టూ అద్దాల తలుపుల్లోంచి.

అరె మోహన్‌లా ఉన్నాడే! అనిపించి మరోసారి తేరిపార చూసింది. నవ్వుతూ చెయ్యి ఊపుతున్నాడు. తనకి పట్టలేని ఆనందం వేసి లగేజ్ కారు వదిలేసి రెండు చేతులూ ఊపేసినిది. నున్నటి గచ్చుమీద మెల్లిగా జారిపోతున్న దాన్ని గబుక్కున ఆపి గబగబా బయటికి వచ్చింది.

అమ్మా ! ప్రయాణం ఏమీ ట్రబులివ్వలేదు కదా ! అంటూ చేతిలోని సంచీ అందుకుని కారు తనుతోస్తూ నడు నడు ! మన కారు చాలా దూరంలో ఉంది అన్నాడు. మనవాళ్ళంతా ఎలాగున్నారు ? అంటూ ఏవేవో ప్రశ్నలు వేస్తుంటే వీడికి అమెరికా స్టైల్ వచ్చేసింది. కాస్త రంగు కూడా వచ్చింది. చాలా పెద్దవాడైనట్లు అనిపిస్తున్నాడు. ఇంక వీడికో చక్కని పిల్లని చూసి పెళ్ళి చేసేయాలి. ఇంతకీ ఆ ఛాన్సు నాకు ఇస్తాడో ఇవ్వడో! అలా ఊహల్లో తేలిపోతోంది వరలక్ష్మి.

"ఏమిటమ్మా ! నేనెన్ని ప్రశ్నలేసినా జవాబు చెప్పవు !" అన్నాడు మోహన్.

"ఏం లేదురా ! ఒక్కసారి మరో ప్రపంచంలోకి అడుగు పెట్టినట్లుంది. అటు చూడు. ఎన్ని రంగుల్లో కొన్ని వేల కార్లుంటాయేమో! అవన్నింటిలో మనకారు ఏదా అని ఆలోచిస్తున్నాను" అంది మాట మారుస్తూ. వెళ్ళేవార్ని దింపడానికి, వచ్చే వారిని తీసుకెళ్ళడానికీ వచ్చినవే ఆ కార్లన్నీ.



అబ్బ ఎంత పెద్ద ఎయిర్‌పోర్టో అనుకుంటూ దారి పొడుగుతా ఇళ్ళు చేరేలోపున కనిపించిన వాటి గురించి చెబుతూంటే ఆశ్చర్యంతో వింటూ 6 గంటల తర్వాత డేటన్‌లో ఇంటికి చేరారు. స్నానం, భోజనం వగైరాలు ముగించగానే అమ్మా ! జెట్‌లాక్ వస్తుంది. కాసేపు నిద్రపో ఇప్పుడు ఇండియాలో గాఢనిద్ర పోయే అర్ధరాత్రి సమయం తెలుసా అన్నాడు. "ఔనా ! అన్నీ పూర్తి వ్యతిరేకమే ! అన్నమాట, అయినా నాకు నిద్ర రావటం లేదులే ! నీకు శని, ఆదివారాలు శలవన్నమాట. సోమవారం ఉదయమే ఎన్ని గంటలకి వెళ్ళాలి ? మళ్ళీ ఎప్పుడు వస్తావు. తిండీ తిప్పలు ఏం చేస్తున్నావు ? "అమ్మా ! అన్నీ స్వయంపాకమే ! ఇక్కడ అందరూ అంతే !! ఇంకా అంట్లు కూడా కడుక్కుంటున్నా తెలుసా ? అన్నాడు ఘనకార్యం చేస్తున్న ఫోజు పెట్టి.

వరలక్ష్మి కొడుకుని చూసి మనసారా నవ్వుకుంది. ఇంతలో ఫోను మోగింది. "హలో" అన్నాడు మోహన్.

హాయ్ ఆంటీ ! హౌ ఆర్ యూ ? ఆ ! ఆ ! అమ్మ వచ్చింది ! ఇప్పుడే కాస్త రిలాక్స్ ఔతోంది ! ఇదో ! అమ్మ మాట్లాడుతుంది ! అంటూ ఫోను తల్లికందించాడు మోహన్. ఎవరురా ? అన్నట్లు ప్రశ్నార్థకంగా మొహం పెట్టిన తల్లితో 'సుగుణ ఆంటీ' అన్నాడు మెల్లగా.

"అరె సుగుణా ! ఉత్సాహంగా అంటూ ! హలో ! సుగుణా ! ఎన్నాళ్ళయిందే మనం కలుసుకుని ? అంది. ఆనందం పట్టలేకపోయింది వరలక్ష్మి.

"అందుకే మరి ! వెంటనే చేశాను ! నాకూ నిన్ను చూడాలని ఉంది. మనం బోలెడు కబుర్లు చెప్పుకోవాలి. మన ఫ్రెండ్సందరూ ఎలా ఉన్నారు ? ఎక్కడున్నారు ? ఏం చేస్తున్నారు ?" వరలక్ష్మి గుక్క తిప్పుకోకుండా చెప్పుకుపోతోంది. తను ఎప్పుడూ వినని పేర్లు, కబుర్లూ వింటూ మోహన్ తల్లి ముఖంలోని సంతోషం చూస్తూ కూర్చున్నాడు.

"ఇలా ఎంతసేపు ఫోన్‌లో చెప్పుకుంటాం ! ఒకసారి నువ్వు రాకూడదూ ! అన్నట్లు మీ అమ్మాయిని కూడా తీసుకురా ! ఎప్పుడో చిన్నప్పుడు చూశాను." అంది చివరకి.

"అట్లాంటా చూసినట్లుంటుంది. నువ్వేరా ! ఇక్కడ జార్జియా యూనివర్సిటీలోనే మా అమ్మాయి విమల చదువుతోంది. ఇంకా ఇక్కడ చూడవలసినవి అన్నీ చూపిస్తాం ! ఇంకో కొత్త ఊరు చూసిన దానివౌతావు. ఏదీ మోహన్‌కియ్యి చెపుతాను" అంది సుగుణ.

కొడుకు చేతిలో ఫోను పెట్టి ఏమంటాడా అని చూస్తోంది వరలక్ష్మి.

"సరే ఆంటీ ! నెక్స్ట్ వీకే తీసుకొస్తాను. ఈవారం కాస్త రెస్ట్ తీసుకుంటుంది. రేపే ఫ్లైట్ టిక్కెట్స్ బుక్ చేస్తాను. సరేనా ? ప్రామిస్ ! అన్నాడు మోహన్. ఫోన్ పెట్టేస్తూ తన మనసులో మాటని గ్రహించినట్లు చెప్పిన కొడుకుని ఆప్యాయంగా చూస్తూండి పోయింది వరలక్ష్మి మనసులో అభినందిస్తూ.

"ఊ ! ఇప్పుడు చెప్పమ్మా ! సుగుణ ఆంటీ పూర్తి వివరాలు. ఆవిడ నీ చిన్ననాటి స్నేహితురాలని మాత్రమే నాకు తెలుసు ! ఆయనకి డాక్టరుగా మంచి పేరు ఉందిట కదా !"

"ఔనురా ! వాళ్ళది డాక్టర్ల కుటుంబమే. సుగుణ తండ్రి మన ఊరిలో కల్లా పెద్ద డాక్టరు. మంచివాడన్న పేరు. బోలెడు ఆస్తి. అన్నీ ఉన్నాయి కానీ సంతానమే కలుగలేదు చాలా కాలం. వైద్యం చేసి గొప్పవాళ్ళ దగ్గిర ఖచ్చితంగా డబ్బు వసూలు చేసేవారు. అదే బీదవారైతే ఉచితంగా వైద్యం చెయ్యడమే కాకుండా ఆర్థిక సహాయం కూడా చేసే వారాయన. ఆయన భార్య కూడా చాలా మంచి ఇల్లాలు. దైవభక్తి ఎక్కువ. పిల్లలు కోసం ఆవిడ మొక్కని దేవుడు లేడు. చేయని పూజా లేదు. అలా ఇరవై యేళ్ళు గడిపారు.

చివరికి భగవంతుడికి వారి మీద జాలి కల్గిందేమో సుగుణ పుట్టింది. లేక లేక కలిగిన సంతానం. ఎంత అపురూపంగా పెంచారో నేను చెప్పలేను. నాకు స్కూలులోనే పరిచయమైంది సుగుణ. 6వ తరగతి నుంచీ కలిసి చదువుకున్నాము. బాగా డబ్బున్న వాళ్ళమ్మాయి అని గర్వంగా ఉండేది కాదు. హైస్కూలు చదువు పూర్తయ్యేసరికి మీ తాతగార్కి అంటే మా నాన్నగార్కి ట్రాన్సఫర్ అయింది. అంతే ఇంక ఆ ఊరు వదిలేసి వచ్చేశాము. కానీ ఉత్తరాల ద్వారా ఒకరి విషయాలు ఒకరు తెలుసుకునేవారము.

నాకు డిగ్రీ పూర్తి కాగానే పెళ్ళయిపోయింది. తను పెళ్ళికి గూడా వచ్చింది. తన పెళ్ళికి నేను వెళ్ళలేకపోయాను. తర్వాత ఒకసారి ఆ ఊరు వెళ్ళినప్పుడు వాళ్ళమ్మ గారు చెప్పిన కబుర్లు విన్నప్పుడు ఒక చెంప సంతోషం. ఒక ప్రక్క బాధ అనిపించింది నిట్టూర్చింది.

"అమ్మా భలే సస్పెన్స్‌తో చెబుతున్నావు కథ. నువ్వు చిన్నప్పటినించీ అంతే! ఆ ! తర్వాత ఏమైంది. సంతోషం వేసింది సరే ! బాధ ఎందుకో !" అన్నాడు మోహన్.



అదేరా ! ఆ అబ్బాయి 'రఘు' నాకు కూడా తెలుసు. సుగుణ వాళ్ళ నాన్నగారే ఆ అబ్బాయిని చిన్నప్పటినించీ చదివించారు. వాళ్ళు చాలా బీదవాళ్ళు. ఏదో దూరపు బంధుత్వం కూడా ఉంది. రఘు తండ్రికి వైద్యం చేసినప్పుడు 'రఘు'ని చూసి డాక్టరు గారు ముచ్చట పడ్డారు. అఖండమైన తెలివితేటలు, అందమైన విగ్రహం. ఆర్థిక స్తోమత లేక కాలేజీలో చేర్పించలేక పోతున్నాం అని తల్లీ తండ్రీ వాపోతూంటే ఆయన 'రఘు' బాధ్యత అంతా తనే తీసుకుని ఎమ్.బి.బి.ఎస్. చదివించారు. పై చదువులకి ఫారిన్ వెడతానంటే కూడా పంపించారు. కానీ ఒక షరతు పెట్టారు. తను అక్కడ డిగ్రీ తీసుకున్నాక తిరిగి ఇండియా వచ్చేయాలి. ఇక్కడే ఊరిలో ప్రజలకి సేవలందించాలి !" అని సరే అని వెళ్ళాడు రఘు. ఒక్క క్షణం ఆగింది ఆవిడ ! ఊ !! ఆ తర్వాత ?

తర్వాత ఏముంది రేవు దాటాక బోడి మల్లయ్య ! సామెత లాగ అయ్యింది. సుగుణ వాళ్ళమ్మ చెబుతుంతే చాలా జాలేసింది.

రఘు యు.ఎస్.ఎ. వెళ్లేనాటికి సుగుణ డిగ్రీ పూర్తి చేసింది. ఇంక పెళ్ళి చేద్దామనుకుంటున్నారు. ఎవరికో కట్టబెట్టేబదులు కళ్ళముందు ఎదిగిన పిల్లాడు రఘుకే ఇస్తే బాగుంటుంది అనుకున్నారు. సుగుణ కూడా రఘుని ఇష్టపడింది. ఒకసారి హోలీడేస్‌కి వచ్చినప్పుడు రఘుతో చెబితే అతడూ అంగీకరించాడు. అతని తల్లిదండ్రులకి అసలే అభ్యంతరం లేదు. బోలెడు ఆస్తితో ఒక్కగానొక్క పిల్ల. అందులో చాలా అందంగా కూడా ఉంటుందేమో. అందరికీ ఇష్టమైంది. పెళ్ళి జరిగిపోయింది. ఆ పెళ్ళి శుభలేఖ వచ్చినప్పుడు నేను హాస్పిటలులో ఉన్నాను. అప్పటికి నాల్గు రోజులైంది నువ్వు పుట్టి. అందుకే వెళ్ళలేకపోయాను.

చదివించినందుకు విశ్వాసముతోనైనా ఇండియాకి వచ్చేయవచ్చు. వాళ్ళు ఆ సుగుణని విడిచిపెట్టి ఉండలేరని తెలుసు కనుక వచ్చేయవచ్చు. కానీ రఘు రాలేదు.

చదువు మధ్యలో పెళ్ళి చేశారు. పూర్తిగా చదువైపోయాక వచ్చేస్తాడు అనుకున్నారు. గానీ రాలేదు. చదువైపోగానే అక్కడే ఉద్యోగంలో చేరిపోయాడు.

ఎన్నో విధాల చెప్పి చూసిందిట సుగుణ. అయినా వినలేదు. అతని తల్లీ తండ్రీ సుగుణ తల్లిదండ్రులూ కన్నీళ్ళుతో ప్రాధేనపడ్డారుట. అయినా వినలేదు. మీకోసం నా భవిష్యత్తు పాడుచేసుకోలేనని నిష్కర్షగా చెప్పేశాడుట. నీకు భర్త కావాలో తల్లీతండ్రీ కావాలో నువ్వే నిర్ణయించుకో ! వాళ్ళే ముఖ్యం అనుకుంటే

ఇక్కడే ఉండిపో ! కాదూ అందరిలా హాయిగా భర్తతో కాపురం పిల్లా పాపలతో చక్కని సంసారం కావాలంటే నాతో అక్కడికి వచ్చేసెయ్యి ! ఒక ఆరునెలలు టైమిస్తున్నాను. ఆలోచించుకోడానికి అని చెప్పి చక్కాపోయాడట.

సుగుణ ! తను ఆడపిల్ల కాబట్టి కదా ! ఇటువంటి పరీక్ష. ఇటు తనమీద ప్రాణాలు నిలుపుకున్న తల్లిదండ్రులని వదిలేసి అలా దూరదేశం వెళ్ళలేదు. అటు చక్కని కాపురం వదులుకోలేదు. రఘుకి సుగుణ అంటే చాలా ప్రేమ. అతడేం దుర్మార్గుడు కాదు. కానీ ఈ విషయంలో కఠినంగా ఉండడంతోనే వచ్చింది చిక్కంతా!

ఎవరో పెద్ద మనుష్యులు కలుగజేసుకుని "డాక్టరుగారే నిన్ను ఆదుకుని బోలెడు ఖర్చుపెట్టి చదివించకపోతే ఎక్కడుండేవాడివి ? పెద్దతనంలో ఆయన్ని క్షోభ పెట్టడం మంచిది కాదు !" అని చెప్పబోతే

ఆయన మీద నాకు కృతజ్ఞత నేను బ్రతికినంతకాలమూ ఉంటుంది. ఆయన నాపైన వెచ్చించిన సొమ్మంతా తిరిగి ఇచ్చేస్తాను. అంతేకాని ఈ పల్లెటూరిలో ఉండి నా జీవితం పాడుచేసుకోలేను అన్నాడట ! అంతే ! అందరూ మాట్లాడలేక ఊరుకున్నారు.

తల్లీ తండ్రీ గుండెరాయి చేసుకుని సుగుణని అమెరికా పంపించేశారు. మళ్ళీ వాళ్ళిద్దరూ మిగిలారు. కళ్ళముందు కాకపోయినా ఎక్కడ అక్కడ కులాసాగా ఉంది కూతురని తృప్తి పడడం అలవాటు చేసుకున్నారు. 2, 3 ఏళ్ళకి వచ్చి చూసి వెళ్ళేది సుగుణ.

మనుమరాలు పుట్టిందని ఇద్దరూ ఒకసారి చూసి వచ్చారేమో ! అంతే. ఒకటి రెండు ఏళ్ళ తేడాలో ఇద్దరూ చనిపోయారు. ఇంక సుగుణ ఇండియా వెళ్ళడమే మానేసింది. తనకీ ఒక్కత్తే కూతురు. జార్జియా యూనివర్సిటీలో పోష్టు గ్రాడ్యుయేషన్ చేస్తోందిట.. అదీ సుగుణ కథ. అంటూ ముగించింది వరలక్ష్మి.

"బాగుంది అమ్మా ! ఇంక కాసేపు విశ్రాంతి తీసుకో" అన్నాడు మోహన్ !

* * *

అనుకున్నట్లుగా నెక్స్ట్ వీక్ అట్లాంటా వెళ్ళడానికి ప్లాన్ చేసుకుంటే ఆఫీసులో చాలా వర్కు ఉన్నందువల్ల మోహన్‌కి వీలు పడలేదు. ఆపై వారం కూడా తల్లిని మాత్రమే పంపవలసి వచ్చింది. "ఇక్కడ డేటన్‌లో నేను ఫ్లైట్ ఎక్కిస్తాను అట్లాంటా 1 1/2 గంటలో వెళ్ళిపోతావు. అక్కడ ఆంటీ రిసీవ్ చేసుకుంటుంది" అన్నాడు



మోహన్.

రోజుకోసారి ఫోను చేస్తూ చాలా అత్యవసరమైన విషయం నీతో మాట్లాడాలి త్వరగా రా అని పదే పదే సుగుణ అంటూంటే ఇంక ధైర్యం చెయ్యక తప్పలేదు వరలక్ష్మికి.

సరే ! వెడతాను ! అంది. అంతే. ఇక్కడ ఎక్కి అక్కడ దిగేసింది. సుగుణ, విమల ఎయిర్‌పోర్టుకి వచ్చారు. కనిపించగానే "హాయ్‌లక్ష్మీ" అంటూ వాటేసుకుంది సుగుణ. విమల చక్కగా కారు డ్రైవ్ చేసింది. పిల్ల కూడా కుందనపు బొమ్మలాగుంది. తన కొడుక్కిస్తే బాగుండును. అని మనసులో అనుకోకుండా ఉండలేకపోయింది. ఒకవేళ ముఖ్య విషయం మాట్లాడాలని అంది సుగుణ. ఇదేనేమోరా. "ఏమిటీ ! పరధ్యానం ! లక్ష్మీ ! ఇందాకటినించీ నేను వాగుతూంటే నువ్వేం జవాబు చెప్పవ్" అంది సుగుణ.

"ఆ ! ఆ ! వింటున్నా ! అంతా కొత్తగదా ! అన్నీ చూస్తున్నా ! అంది వరలక్ష్మి సర్దుకుంటూ వారం రోజులు ఇట్టే గడిచిపోయాయి.

సి.ఎన్.ఎన్. కోకోకోలా కంపెనీ, వెంకటేశ్వర స్వామి గుడి, ఒలింపిక్స్ జరిగిన స్థలం జార్జియా యూనివర్సిటీ అన్నీ చూపించేశారు వరుసగా. మళ్ళీ శనివారం తన తిరుగు ప్రయాణం ! ఏదో ముఖ్య విషయం మాట్లాడాలంది. ఇంత వరకు ఆమాటే ఎత్తలేదు సుగుణ. సుగున భర్త రఘు చాలా బీజీ డాక్టరు. ఆయన ఈ వారం రోజుల్లో ఏ ఒకటి రెండు సార్లో డిన్నరు టైములో కనబడ్డారు. పెద్ద కోటలాంటి ఇల్లు. కోటి రూపాయలు విలువ చేస్తుంది. మన డబ్బుతో చూసుకుంటే ఎవరి గదులు వాళ్ళవి. ఎవరి కార్లు వాళ్ళవి. పై అంతస్థులో బెడ్‌రూమ్స్, గెష్టు రూమ్స్ చాలా నచ్చింది వరలక్ష్మికి. ముఖ్యంగా ఫ్రంట్ యార్డ్‌లో లాన్, వెనక యార్డు లేక్ ! చాలా ఆహ్లాదంగా ఉంది. ఇక ఉండబట్టలేక తనే "ఏదో చెప్పాలన్నావు ! నేను రేపు వెళ్ళిపోతాను కదా ! అన్నట్లు మీ అమ్మాయికి ఇంకా పెళ్ళి చెయ్యాలనుకోడం లేదా !? అనేసింది. అదిగో అప్పుడు బయట పడింది సుగుణ.

"ఏం చెప్పమంటావు ? మరో 3 నెలల్లో దాని చదువైపోతుంది. మంచి సంబంధం చూశాము. అతనూ డాక్టరే ! వాళ్ళూ మాలాగే 25 ఏళ్ళనాడు వచ్చి ఇక్కడ సెటిల్ అయిపోయారు. విమలని ఎక్కడో పార్టీలో చూసి ఇష్టపడి వాళ్ళబ్బాయి సుధీర్ ఆ అమ్మాయినే చేసుకుంటానని పట్టుబట్టాడని వాళ్ళే వచ్చి అడిగారు. మాకూ

ఇక్కడే ఉండిపో ! కాదూ అందరిలా హాయిగా భర్తతో కాపురం పిల్లా పాపలతో చక్కని సంసారం కావాలంటే నాతో అక్కడికి వచ్చేసెయ్యి ! ఒక ఆరునెలలు టైమిస్తున్నాను. ఆలోచించుకోడానికి అని చెప్పి చక్కాపోయాడట.

సుగుణ ! తను ఆడపిల్ల కాబట్టి కదా ! ఇటువంటి పరీక్ష. ఇటు తనమీద ప్రాణాలు నిలుపుకున్న తల్లిదండ్రులని వదిలేసి అలా దూరదేశం వెళ్ళలేదు. అటు చక్కని కాపురం వదులుకోలేదు. రఘుకి సుగుణ అంటే చాలా ప్రేమ. అతడేం దుర్మార్గుడు కాదు. కానీ ఈ విషయంలో కఠినంగా ఉండడంతోనే వచ్చింది చిక్కంతా!

ఎవరో పెద్ద మనుష్యులు కలుగజేసుకుని "డాక్టరుగారే నిన్ను ఆదుకుని బోలెడు ఖర్చుపెట్టి చదివించకపోతే ఎక్కడుండేవాడివి ? పెద్దతనంలో ఆయన్ని క్షోభ పెట్టడం మంచిది కాదు !" అని చెప్పబోతే

ఆయన మీద నాకు కృతజ్ఞత నేను బ్రతికినంతకాలమూ ఉంటుంది. ఆయన నాపైన వెచ్చించిన సొమ్మంతా తిరిగి ఇచ్చేస్తాను. అంతేకాని ఈ పల్లెటూరిలో ఉండి నా జీవితం పాడుచేసుకోలేను అన్నాడట ! అంతే ! అందరూ మాట్లాడలేక ఊరుకున్నారు.

తల్లీ తండ్రీ గుండెరాయి చేసుకుని సుగుణని అమెరికా పంపించేశారు. మళ్ళీ వాళ్ళిద్దరూ మిగిలారు. కళ్ళముందు కాకపోయినా ఎక్కడ అక్కడ కులాసాగా ఉంది కూతురని తృప్తి పడడం అలవాటు చేసుకున్నారు. 2, 3 ఏళ్ళకి వచ్చి చూసి వెళ్ళేది సుగుణ.

మనుమరాలు పుట్టిందని ఇద్దరూ ఒకసారి చూసి వచ్చారేమో ! అంతే. ఒకటి రెండు ఏళ్ళ తేడాలో ఇద్దరూ చనిపోయారు. ఇంక సుగుణ ఇండియా వెళ్ళడమే మానేసింది. తనకీ ఒక్కత్తే కూతురు. జార్జియా యూనివర్శిటీలో పోష్టు గ్రాడ్యుయేషన్ చేస్తోందిట.. అదీ సుగుణ కథ. అంటూ ముగించింది వరలక్ష్మి.

"బాగుంది అమ్మా ! ఇంక కాసేపు విశ్రాంతి తీసుకో" అన్నాడు మోహన్ !

* * *

అనుకున్నట్లుగా నెక్స్ట్ వీక్ అట్లాంటా వెళ్ళడానికి ప్లాన్ చేసుకుంటే ఆఫీసులో చాలా వర్కు ఉన్నందువల్ల మోహన్‌కి వీలు పడలేదు. ఆపై వారం కూడా తల్లిని మాత్రమే పంపవలసి వచ్చింది. "ఇక్కడ డేటన్‌లో నేను ఫ్లైట్ ఎక్కిస్తాను అట్లాంటా 1 1/2 గంటలో వెళ్ళిపోతావు. అక్కడ ఆంటీ రిసీవ్ చేసుకుంటుంది" అన్నాడు



మోహన్.

రోజుకోసారి ఫోను చేస్తూ చాలా అత్యవసరమైన విషయం నీతో మాట్లాడాలి త్వరగా రా అని పదే పదే సుగుణ అంటూంటే ఇంక ధైర్యం చెయ్యక తప్పలేదు వరలక్ష్మికి.

సరే ! వెడతాను ! అంది. అంతే. ఇక్కడ ఎక్కి అక్కడ దిగేసింది. సుగుణ, విమల ఎయిర్‌పోర్టుకి వచ్చారు. కనిపించగానే "హాయ్‌లక్ష్మి" అంటూ వాటేసుకుంది సుగుణ. విమల చక్కగా కారు డ్రైవ్ చేసింది. పిల్ల కూడా కుందనపు బొమ్మలాగుంది. తన కొడుక్కిస్తే బాగుండును. అని మనసులో అనుకోకుండా ఉండలేకపోయింది. ఒకవేళ ముఖ్య విషయం మాట్లాడాలని అంది సుగుణ. ఇదేనేమోరా. "ఏమిటీ ! పరధ్యానం ! లక్ష్మి ! ఇందాకటినించీ నేను వాగుతూంటే నువ్వేం జవాబు చెప్పవ్" అంది సుగుణ.

"ఆ ! ఆ ! వింటున్నా ! అంతా కొత్తగదా ! అన్నీ చూస్తున్నా ! అంది వరలక్ష్మి సర్దుకుంటూ వారం రోజులు ఇట్టే గడిచిపోయాయి.

సి.ఎన్.ఎన్. కోకోకోలా కంపెనీ, వెంకటేశ్వర స్వామి గుడి, ఒలింపిక్స్ జరిగిన స్థలం జార్జియా యూనివర్శిటీ అన్నీ చూపించేశారు వరుసగా. మళ్ళీ శనివారం తన తిరుగు ప్రయాణం ! ఏదో ముఖ్య విషయం మాట్లాడాలంది. ఇంత వరకు ఆమాటే ఎత్తలేదు సుగుణ. సుగున భర్త రఘు చాలా బీజీ డాక్టరు. ఆయన ఈ వారం రోజుల్లో ఏ ఒకటి రెండు సార్లో డిన్నరు టైములో కనబడ్డారు. పెద్ద కోటలాంటి ఇల్లు. కోటి రూపాయలు విలువ చేస్తుంది. మన డబ్బుతో చూసుకుంటే ఎవరి గదులు వాళ్ళవి. ఎవరి కార్లు వాళ్ళవి. పై అంతస్థులో బెడ్‌రూమ్స్, గెస్టు రూమ్స్ చాలా నచ్చింది వరలక్ష్మికి. ముఖ్యంగా ఫ్రంట్ యార్డ్‌లో లాన్, వెనక యార్డు లేక్ ! చాలా ఆహ్లాదంగా ఉంది. ఇక ఉండబట్టలేక తనే "ఏదో చెప్పాలన్నావు ! నేను రేపు వెళ్ళిపోతాను కదా ! అన్నట్లు మీ అమ్మాయికి ఇంకా పెళ్ళి చెయ్యాలనుకోడం లేదా !? అనేసింది. అదిగో అప్పుడు బయట పడింది సుగుణ.

"ఏం చెప్పమంటావు ? మరో 3 నెలల్లో దాని చదువైపోతుంది. మంచి సంబంధం చూశాము. అతనూ డాక్టరే ! వాళ్ళూ మాలాగే 25 ఏళ్ళనాడు వచ్చి ఇక్కడ సెటిల్ అయిపోయారు. విమలని ఎక్కడో పార్టీలో చూసి ఇష్టపడి వాళ్ళబ్బాయి సుధీర్ ఆ అమ్మాయినే చేసుకుంటానని పట్టుబట్టాడని వాళ్ళే వచ్చి అడిగారు. మాకూ

ఇష్టమే !" అంది సుగుణ.

ఒక్కక్షణం అయ్యో ! అనిపించినా ! అయితే మరేమిటి ? ఆలస్యం !" అంది వరలక్ష్మి ఆతురతగా !

"అక్కడే మొదలైంది సమస్య ! మా విమల తన క్లాస్‌మేట్ రవిని ప్రేమించిందట. ఇద్దరూ పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాక, చదువు అయిపోగానే రవి ఇండియా వెళ్ళిపోతాడట. అతడూ ఒక్కడే కొడుకట. వాళ్ళ అమ్మా నాన్నలకి చదువు కాగానే వచ్చేస్తానని మాట ఇచ్చేడట. అతడిని చేసుకుంటే విమల మాకు దూరమైపోతుంది మాకూ అది ఒక్కత్తేగా.

మేము చూసిన ఆ డాక్టరు సుధీర్ అయితే ఇక్కడే మాకు దగ్గరలో ఉంటారు. నాకు దాని పెళ్ళిమాట అంటేనే భయం వేస్తోంది. వాళ్ళ నాన్నకి ఏమీ పట్టదు. దాని లైఫ్ దాని ఇష్టం అంటారు.

నువ్వు కాస్త దానికి నచ్చచెప్పుతావని వెంటనే రమ్మన్నాను.

హిస్టరీ రిపీట్స్ అన్నమాట. ఇంతకీ విమల ఏమంటుంది ?

"అది ఆ రవినే చేసుకుంటుందిట. ఇండియా పెళ్ళిపోతుందిట !"

"మరింకేం ? పెద్ద పిల్లలయ్యాక మనం ఏం చెప్పగలం ?"

నువ్వు అందర్నీ వదిలేసి ఎలా వచ్చావో విమలా అలాగే మీ నుండి వెళ్ళిపోతుంది.

"దాని మొహం ! ఇక్కడ పుట్టి, పెరిగి ఈ వాతావరణానికి అలవాటు పడ్డ మనిషి ఇండియాలో సర్దుకుపోగలదా ! ఉండలేక లేచి చక్కా వస్తే రెంటికీ చెడ్డ రేవడి అయిపోదూ !" సుగుణ గొంతులో బాధ సుడులు తిరిగింది.

"నిజంగా ! విషమ సమస్యే !" పాపం సుగుణ మీద జాలి వేసింది.

అలాగని విమల ఆలోచన సరియైనది కాదనలేము.

మొత్తంమీద తరం మారినా సమస్య మారలేదు.

ఎప్పుడూ స్త్రీయే భర్తని అనుసరిస్తుంది, అనుసరించగలదు, అనుసరించింది.



# మానినీ మానసం

పశ్చిమాద్రిని భాస్కరుడు కుంకుమ వర్ణశోభతో వెలిగిపోతూ, కెంజాయలను ఆకాశంలో చిమ్ముతూ భూమాతనుండి శలవు తీసుకుంటున్నాడు.

రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది. ఇరుప్రక్కల చెట్లు విరబోసుకున్న జుట్టుతో ఏదో పూనకం వచ్చి ఊగిపోతున్న వనితల్లా భయోత్పాతం కల్గిస్తున్నాయి.

అటు అందమైన భానుబింబంగానీ ఇటు ఊగిపోతున్న వృక్షాల వైఖరిగాని కారు నడుపుతున్న సుగుణ ఏకాగ్రతకి భంగం కల్గించలేదు.

గాలి వృధృతం ఇంకా ఎక్కువ కాకుండా సాధ్యమైనంత త్వరలో గమ్యం చేరాలి అన్నదే ఆమె దీక్ష. ఉన్నట్లుండి కారుకి అడ్డంగా వచ్చిన బొచ్చుకుక్కపిల్ల కోసం సడెన్ బ్రేక్ వేసింది. వెంటనే వెనుక సీటులో మగతగా 'ఏమైందే' అంది తల్లి. "ఏం లేదులే ! చూడు ఆ కుక్కపిల్ల ఎంత ముద్దొస్తోందో !" అంది. దాని ప్రాణం కాపాడగలిగానన్న ఆనందంతో.

"కారు తిరిగి స్టార్ట్ చేస్తే ఇంక కదిలేది లేదంటూ మొరాయించింది. ఏం చేయాలో పాలుపోక కారుదిగి చుట్టు పక్కల ఎవరేనా సహాయం చేస్తారేమోనని చూడసాగింది.

కొద్దిదూరంలో ఒక బిల్డింగు కనబడింది. "అమ్మా ! నువ్వు కూర్చునే ఉండు. ఆ మేడ దగ్గరకి వెళ్ళి అక్కడెవరేనా సహాయపడతారేమో అడిగివస్తాను." అంటూ చకచకా ముందుకు నడిచింది.

"సుగుణా ! ఒక్కత్తెవూ ఎందుకు నేనూ వస్తా పద !" అంటూ బయలు దేరింది తల్లి !

సరే కారు లాక్ చేసి నేను ముందు వెడతాను. వెనకాల మెల్లిగా రా ! ఈ కారు కదిలి మనం వెళ్ళేసరికి ఆ డాక్టరు గారు క్లినిక్ మూసేసి వెళ్ళిపోతారే ఏమిటో! సుగుణకి చెప్పలేని విస్పృహ కల్గింది.

"బాగానే ఉన్నా నంటే వినవు ! కదా ! నాకు అనారోగ్యం ఏముంది చెప్పు!"

"నీకేం లేదు ! సరేనా ! అంటూ సుగుణ గబగబా నడిచింది.

ఒక పెద్ద ఆవరణలో చుట్టూ చక్కని పూల చెట్లు, మధ్యలో ముచ్చటగా ఉందా ఇల్లు. ఇంటి పూర్వీకులు ఎప్పుడో వేసినట్లున్నారు. అక్కడక్కడా పెద్దపెద్ద చెట్లు, చుట్టూతా కూర్చునేందు వీలుగా సిమెంటు బెంచీలు. వానిమీద కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్న వృద్ధ వనితలు వింతగా చూసుకుంటూ ముందుకు వెళ్ళింది. అక్కడ ఆఫీసు రూములా ఉంది. లోపలికి తొంగి చూసి "లోపలికి రావచ్చా !" అంది ఒక 50, 60 ఏళ్ళకి మధ్య వయసున్న ఆవిడని చూస్తూ.

"ఆ ఆ ! రండి ! రండి !! ఎవరు మీరు ? ఎందుకు వచ్చారో తెలుపగలరా!" అంటూ చక్కగా మాట్లాడింది ఒకావిడ. నా పేరు అరుంధతి. నేనీ వనితా వృద్ధాశ్రమం ఆర్గనైజర్ని.

నమస్కారం ! నా పేరు సుగుణ ! మా అమ్మగార్ని డాక్టరు దగ్గరికి తీసుకుని వెడుతూంటే కారు ఆగిపోయింది. మెకానిక్ ఎవరైనా తెలిస్తే చెప్పగలరా!" వినయంగా అడిగింది.

"ఓ ! తప్పకుండా ! ఇప్పుడే మా మెకానిక్ షెడ్‌కి ఫోన్ చేస్తాను" అంటూనే ఫోన్ చేసి, గంట, గంటన్నరలో రావచ్చు. అంతవరకు మీ అమ్మగార్ని కూడా వచ్చి లోపల గదుల్లో కూర్చోమనండి !" అంది అరుంధతి గారు మర్యాద ఉట్టిపడే స్వరంతో!

సరే ! అని గదిలోంచి బయటకి వచ్చిన సుగుణకి అద్భుతమైన సంఘటన కళ్ళబడింది. దూరంగా చెట్లక్రింద సిమెంటు బెంచీల మీద కూర్చున్న వాళ్ళతో ఎంతో ఉత్సాహంగా చేతులు తిప్పుతూ, నవ్వుతూ కబుర్లు చెప్పేస్తోంది సుగుణ తల్లి సుభద్రమ్మ.

ఒక విధమైన సంతోషం ! ఆశ్చర్యం ఆమె కళ్ళల్లో కదలాడడం చూసిన అరుంధతి గార్కి ఏమీ అర్థంగాక సుగుణ చూసిన వైపు చూసింది. కానీ ఆమెకి అందులో వింత ఏమీ గోచరించలేదు.



ఆవిడేనా మీ అమ్మగారు ! అంటూ అమ్మా ! అంటూ ఆమె దగ్గరకి వెళ్ళబోతున్న సుగుణను చెయ్యి పట్టుకుని ఆపి, రండి మనం ఇలా ఈ చెట్టు కింద కూర్చుందాం ! అందరూ చీకటి పడేదాకా ఇక్కడే కాలక్షేపం చేసి తర్వాత ఎవరి రూముల్లోకి వాళ్ళు వెళ్ళిపోతారు.

సుగుణకి ఎంతో ఆసక్తి కలిగింది. వీళ్ళందరి గురించి తెలుసుకోవాలని అనిపించి మెల్లిగా ఆమెని అనుసరించింది.

ఇద్దరూ కూర్చున్నాక "ఆ ! ఇప్పుడు చెప్పండి ! సరదాగా మాట్లాడుతున్న మీ అమ్మగార్ని చూసి ఎందుకంత ఆశ్చర్యపోయారు !" అన్నారు అరుంధతి గారు.

"ఏం లేదండి ! చాలా రోజుల తర్వాత ఆవిడ అలా ఉత్సాహంగా కనిపించింది. మా నాన్నగారు పోయి అప్పుడే 5, 6 ఏళ్ళయింది గానీ, ఆవిడ దిగులు మాత్రం తగ్గలేదు. ఆవిడ్ని మామూలు మనిషిగా చూడాలని ఆశతో మేం తీర్థయాత్రలు చేయించాం. వైద్యుల చుట్టూ తిరిగాం. నేనూ మా అన్నయ్యను, చివరికి నాకు అమ్మని అప్పజెప్పేసి వాడు అమెరికా తిరిగి వెళ్ళిపోయాడు."

"ఇక్కడంతా తనలాంటి వాళ్ళు కనబడేసరికి ఇట్టే వాళ్ళతో కలిసిపోయారు చూశారా ! అందుకే దగ్గరికెళ్ళి ఆవిడ మూడ్ పాడుచెయ్యకుండా ఆపాను" అంది అరుంధతి. "మిమ్మల్ని చూసినప్పటి నుంచి మీ గురించీ, ఇక్కడున్న వాళ్ళందరి గురించీ తెలుసుకోవాలని ఉంది. మీ కభ్యంతరం లేకపోతే చెప్పండి" అంది సుగుణ ఆసక్తిగా !

నా గురించి చెప్పుకోడానికేముందమ్మా ! 'అత్తా ఒక ఇంటి కోడలే' అన్నట్లుగా నేనూ అందరిలాగే అన్ని అవతారాలూ ఎత్తాను. అంటే పాపగా, అమ్మాయిగా, గృహిణిగా, కోడలిగా, తల్లిగా చివరికి అత్తగారిగా ! బహుశా చాలామందికి అదే చివరి మజిలీ. నాకే డిగ్రీలు లేవు. అనుభవంతో మనస్తత్వాలని అర్థం చేసుకోగలనంతే !

నా భర్త గారు పోయిన కొత్తలో చాలా దిగులు పడ్డాను. కానీ సంతానం అభివృద్ధి వచ్చేలా చేయాల్సిన బాధ్యత పూర్తిగా నాపైనే ఉండడంతో మా ఆశయాలకు అణుగుణంగా వాళ్ళకి చక్కని భవిష్యత్తు ఏర్పరచాలనే తాపత్రయంతో తాత్కాలికంగా దిగులు పక్కకి తప్పుకుంది. దాని స్థానంలో ధైర్యం పట్టుదల పెరిగింది. అనుకున్నది

"ఏమో మరి ! అదిగో అటు చూడు. ఆ బ్లూ శారీ ఆవిడ. పేరు జానికమ్మ! ఆవిడకిద్దరు కూతుళ్ళు. బోలెడు ఆస్తి. అక్కకి పెట్టేస్తుందేమోనని చెల్లెలు, చెల్లెలికి ఇచ్చేస్తుందేమోనని అక్కా కీచులాటలలో ఆమెని వేధించే సరికి ఎవరి దగ్గర ఉండాలో అర్థంగాక మనశ్శాంతి కోసం ఇక్కడ వచ్చిపడ్డా !" అంటుందావిడ.

ఇంకా ఇలా చాలామంది ఉన్నారు. లలితాంబగారని ఒకరు ఉండేవారు. ఆవిడ చనిపోయేముందు తన తదనంతరం యావదాస్తి వృద్ధాశ్రమానికి చెందేలా విల్లు రాసి ఇక్కడ ఇంకో క్రొత్త బిల్డింగ్ కట్టడానికి విరాళంగా ఇచ్చింది. వచ్చే నెలలో కట్టడం ప్రారంభిస్తాం. ఆవిడ భర్త సన్యాసులలో కలిసిపోయాడట. ఉన్న ఒక్క కూతురూ తల్లిని పట్టించుకోదు. దాంతో ఆవిడకి విరక్తి పుట్టింది.

ఇంకో కేసు వింటే మీరు చాలా ఆశ్చర్యపోతారు. ఆ పచ్చచీర ఆవిడని చూడండి. చాలా అమాయకంగా కనిపిస్తోంది కదూ ! ఆవిడ పేరు కవితగారు.

ఔనండి ! పసిపాప మొహంలో ఉండేంత అమాయకత్వం కనిపిస్తోంది. అల్లాంటావిడని కూడా కష్టపెట్టగలరా ఎవరైనా ?

అన్నింటికీ సులువుగా హర్టు అయ్యేంత సున్నితమైన మనస్తత్వం ఆవిడది. గాజు పలకలాంటి ఆవిడ మనసు పగలకుండా చూసుకునే ఓర్పు ఉండాలి కదా అవతలి వాళ్ళకి ? ఇంతకీ ఆవిడ కథ ఏమిటి ? కుతూహలంగా అడిగింది సుగుణ.

ఆవిడకి బిడ్డల మీద చెప్పలేనంత ప్రేమ. వాళ్ళ పిల్లలకీ ఆవిడమీద చాలా ప్రేమే. కాని ఆమె సున్నితమైన మనస్సు ఏమాత్రం తేడాని తట్టుకోలేదు. కష్టం తోచినప్పుడు ఇక్కడికి వచ్చేసి ఉండిపోతుంది.

కొన్నాళ్ళైనాక ఆవిడ పిల్లలెవరో ఒకరు వచ్చి తీసికెడుతూంటారు. మళ్ళీ 4, 5 నెల్లైసరికి వచ్చేస్తుంది. "అలా వచ్చేసినప్పుడు ఒక్కోసారి ఒక్కొక్క కారణం చెబుతుంది.

ఏమిటి ? ఏమిటి చెబుతుంది ? సుగుణకి వింతగా అనిపించింది.

ఏవో కారణాలు ! ఆవిడనే అడుగుదాం పదండి. నిన్ననే వచ్చిందావిడ.

అంతలో దగ్గరికి వచ్చారిద్దరు. వారేదో అడగాలనుకుంటున్నట్లు కనిపించారు.

"ఈమాటు రెండు నెలలకే తిరిగి వచ్చేసేరే !" అన్నారు అరుంధతి గారు.



"ఔనండీ ! మా కొడుకూ, కోడలూ ఫోను చేసుకోడానికి వీలు లేకుండా చేశారు. ఎస్.టి.డి. లాక్ ఓపెన్ చెయ్యడానికి కోడ్ నెంబరు చెప్పలేదు. మనవరాలు సైతం టిక్కూ, టిక్కూ నొక్కి చేసేస్తుంది. కనీసం అది కూడా చెప్పదు. నే చేయాలి అంటే వాళ్ళే ఓపెన్ చేసి ఇస్తారు. వాళ్ళు ఇంట్లో లేనప్పుడు ఏదైనా అత్యవసరమైనా అంతే కదా ! అసలే గుండె జబ్బుదాన్ని కదా !" చెబుతూంటేనే గొంతు గద్గదమైపోయింది. కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

సుగుణకి ఆవిడ మీద చాలా జాలి వేసింది. ఆవిడ మనసు నొప్పించేలా ఎందుకు ప్రవర్తిస్తారో ! అనుకుంది.

పోన్లెండి బాధ పడకండి. అన్నట్లు మీరు క్షేమంగా చేరినట్లు ఫోను చేశారా ! లేదా ! అవతల వాళ్ళు ఖంగారు పడతారు.

"ఔనండోయ్ ! మర్చేపోయాను ! చెయ్యాలి ! అసలే మా వాడికి కంగారెక్కువ అంటూ ఫోను గదిలోకి పరుగులాంటి నడకతో వెళ్ళుతూన్న ఆవిడనే చూస్తూ అరుంధతి గారు చూశారా 'మానినీ మానసం' సుగుణా !" అన్నారు.

ఇంతలో మెకానిక్ వచ్చి కారు బాగైందన్న కబురందించాడు.

"చాలా థాంక్సండీ ! అరుంధతి గారూ ! అనుకోకుండా ఆశ్రమానికి దగ్గరలో కారు ఆగినప్పుడు చాలా బాధపడ్డాను. కానీ అన్నీ మన మంచికే అన్నట్లుగా ఇక్కడ మిమ్మల్ని చూశాక మీ సదాశయం గమనించాక చాలా తృప్తిగా ఉంది. జీవిత చరమాంకం మనశ్శాంతితో సంతృప్తిగా గడపగలగడమే ఎవ్వరైనా కోరుకునేది. అది మీరు అందిస్తున్నారు. అందుకు మరోసారి థాంక్సు. ఇంక వేం బయలుదేరుతాం ! అంటూ తల్లి దగ్గరకు బయలుదేరింది సుగుణ.

ఒంట్లో శక్తి ఉడిగాక తల్లిదండ్రుల్ని తమ బాల్యంలో వాళ్ళు తమని చూసినట్లుగా జాగ్రత్తగా చూడగలిగితే కావలసిందేముంది ? అలా ఎంతమందికి అవకాశం ఉంటుంది? అనుకుంటూ "అమ్మా ! వెడదాం ! రా ! కారు బాగైంది." అంది.

"సుగుణా ! పోనీ ! వీళ్ళతోబాటు నేనుండిపోయేదా !" అంది.

అమ్మా ! ఏమిటి ! అంటున్నావు ! అంది సుగుణ అయోమయంగా !

"ఔనే ! నాకిక్కడ చాలా బాగుంది. నేను రాను. నువ్వెళ్ళి నా బట్టలూ

అవీ తెచ్చేసెయ్యి !" అందావిడ స్థిరమైన అభిప్రాయంతో కూర్చున్నచోటునించి కదలకుండా.

ఇదివరలో ఒకటి రెండుసార్లు కొడుకు దగ్గర ఉండాలి గానీ, కూతురింట్లో ఎన్నాళ్ళుంటాను ? నన్ను ఎక్కడికైనా పంపేయవే ! అంటూ ఉండేది. ఈ కాలంలో ఆ తేడాలేం లేవు. అన్నయ్యకి అమెరికాలో నిన్ను అట్టేపెట్టకునే అవకాశం లేదు కదా ! ఇంక నా దగ్గరే ఉందువు గాని ! మరెప్పుడూ అనకు అని కళ్ళ నీళ్ళు పెట్టకుంటే ఊరుకుంది.

మళ్ళీ ఇప్పుడిలా ! అంటోంది ఏమిటి ? కొంపతీసి క్యాంప్‌కి వెళ్ళేముందు ఆయన అన్న మాటలు అమ్మ వినేసిందేమో ! సుగుణ గుండె ఝల్లుమంది. తన భర్త మాటలు గుర్తు వచ్చాయి.

సుగుణా ! మా అమ్మా, నాన్న వస్తామని రాశారు. ఈ అపార్టుమెంట్సులో అన్నింటికీ ఇబ్బందే. కొన్నాళ్ళు మీ అమ్మని ఎక్కడేనా దింపేసిరాకూడదా ! "అంటే మీ ఉద్దేశ్యని ఏమిటీ ! ఎవరున్నారని ? ఎక్కడ ఉంటుంది ?

"ఎవరూ లేనివాళ్ళ కోసమే వృద్ధాశ్రమాలు !" అక్కడ చేరిస్తే సరి. మీ అన్నయ్య డబ్బులు పంపిస్తాడు" అన్నాడు కాస్త గట్టిగా.

"అంటే నేనున్నా లేనట్లే అన్నమాట !" దుఃఖంతో గుండె బరువెక్కిన సుగుణ తలగడలో తలదూర్చి నిశ్శబ్దంగా రోదించింది ఆ రాత్రంతా. "ఔను ! అంతే అయి ఉంటుంది. అమ్మ అంతా వినేసింది. అందుకే మరీ మూడీగా ఉంటోందీమధ్య ! అనుకుంది నిస్సహాయంగా సుగుణ. అందుకే "ఇంటికి రాను, ఇక్కడే ఉంటానంటోంది" సుగుణకు చెప్పలేని దుఃఖం కలిగింది.

దైవికంగా ఈ ఆశ్రమం ముందే కారు ఆగిపోవడం, అమ్మకు అనుకోకుండా లేని ఆలోచన కల్పించినట్లయ్యింది. మొండి పట్టు పడితే తనేం చేయగలదు ! ఆడపిల్ల నయినందుకు అమ్మను దూరం చేసుకోవాలా ! అటు భర్తతో అభిప్రాయ భేదాలు తెచ్చుకోవాలా ! ఈ సమస్య తనకేనా ! ప్రతి ఆడపిల్ల మనసు ఇలాగే నలిగిపోతుందా ! కుసుమ కోమలమైన మనసు మానినికే సొంతమా !... పరి పరి విధాలుగా సుగుణ ఆలోచిస్తూ ఉండిపోయింది.